ఓం శాన్తిః

సద్గురుపరబ్రహ్మణేనమః

సద్గురువులకు, శిష్యకోటి విన్నపము. సద్గురువులు దీనిని చూచి తప్పులు క్షమించకోరుచున్నాను. దయానిధి శ్రీమతి మహారాజశ్రీ రాజయోగి అఖండపరిపూర్ణానంద అమృత నిలయంబైన శాన్తినిలయంబగు అఖండసద్గురువుల సతీపతుల పాదపద్మముల దర్శనభాగ్యమున నాదుజన్మ సఫలమునొందెను. బంధమోక్ష దృశ్యములనెడి భ్రాంతిచూపిన కరుణానిధికి కేలు మోడ్చి మ్రొక్కితిని. పుణ్యపురంబు భోగస్థలంబునగు ఆపరమ పావన పార్వతీపురమున సర్వేశ్వరానుగ్రహమున నాకు ఆ పతిత పావన సద్గురు సతీపతుల సందర్శనభాగ్యముజ్ఞానభాగ్యము కలిగినది. మందబుద్ధినగు నాకు ఆపార్వతీపరమేశ్వరులు ప్రత్యక్షమైరి. నాభాగ్యము అంత ఇంతయని చెప్పనలవికాదు అక్కడవిశేషమేమనగా, ఆయాసము, ఆవగింజంతధనవ్యయము లేదు. మానవకోటిలో యెవ్వరైనను ఈవిషయము కావలసినవారు విచారణచేసి సద్గురుసన్నిధిచేరి తరింతురుగదా, అట్టి అభిప్రాయము కనుపరచినను చాలునను వారిని జ్ఞానమార్గమునకు తీసుకురావలెనని తలంతురు. వారు వీరు అను విచారణలేకయే వారి సన్నిధికివచ్చిన వారిని జన్మతరించు యుపాయము నూరి పోయు సద్గురువులు. తెలిసి అడిగినను జవాబు ఇచ్చెదరు. తెలియని నావంటి అజ్ఞాని అడిగినదానికి సరియైన జవాబుచెప్పి

సర్వప్రాణకోటిని సమముగాచూచి ఆదరించెడి సద్గురువుల సతీపతుల పాదములకు సాగిలిమ్రొక్కి చిన్నమనవి చేతును. దయయుంచి పెద్దలు సద్గురువులు క్షమించ ప్రార్థన.

సోదరీమతల్లులారా, స్త్రీరత్నములారా, చిన్నవిన్నపము. నేను అజ్ఞానిని గ్రంథపరిశీలనముగాని, విద్యాబుద్ధులుగాని, యెటువంటివియు ఈ శరీరానుభవములోలేవు. కాని సద్గురువులవల్ల కొంతవరకు ఎట్టికొరతలేని విషయము తెలుసుకొనబడెను. సర్వేశ్వరుడు ప్రసాదించినందుకు నాజన్మ సాఫల్యము అయినది. ఆ సంతసమువల్ల దయానిధి కరుణవల్లను నాసంతోషము ఇట్లు తెలియచేయ చిన్నసంకల్పము భగవదనుగ్రహమున నాకు అంకురించినది. దానిని వ్రాతునుగాన పెద్దలు తప్పులు సవరించ వేడుచున్నాను.

బ్రహ్మశ్రీ రాళ్లపల్లి శ్యామలరావుగారి సతీపతుల రత్నగర్భమున ద్వితీయ ఫలముగా జన్మించిన భాగ్యరత్నము. అల్లారుముద్దుగా అడుగడుగున వందనము లొనర్చు సేవకజనకముతోను, కనురెప్పగా కాపాడు కన్న తల్లిదండ్రులతోను ఆడుచు పాడుచు ఆ బాలప్రాయము ఆటల దినదినాభివృద్ధిగా జరిపిన రాజరత్నము శ్రీ॥ వే॥ బ్ర॥ ఈప్పలూరి వీరరాఘవులుగారి తల్లిదండ్రులకు వంశోద్ధారకురాలగు పెద్దకోడలుగావచ్చిన ధన్యచరిత పరమపావనురాలు భర్తృపాదసేవ చేయుచున్న పరమపావనుని ఉదకమధ్యమున నివసించు తామరపత్రము చందమున సంసారచక్రము గడపుచున్న కాంత. కొంతకాలమునకు

మానవజన్మ సార్థక్యము గనుగొనిన మహాసాధ్వీరత్నము. సాటిలేని రాజయోగిరత్నముగమారిన రమణి. ప్రపంచోద్ధారిక కన్నతల్లి. వారినిచూచినకన్నులు, కన్నులు. వారి బోధవిన్నచెవులు, చెవులు. వారిదరిచేరిన దర్శనభాగ్యంబున జన్మ సఫలము అగునుగదా!

ఇప్పటిస్థితికి వచ్చిన సద్గురువులు ఏమిచేయుచున్నారు అనగా, భక్తజనులు తరించుటకొరకు ఉపనిషత్తులలోని సర్వ సారమును తెలిసికొనుటకు తెలుగులో తేటతెల్లముగా గ్రంథము రచించిరి. దానివల్ల చాలవరకు శిష్యవర్గము జ్ఞాన మార్గమునకు వచ్చుటకు అవకాశము కలిగినది. జగత్తులో మానవకోటిలో స్త్రీలు చాలబాధపడుచున్నారు. జ్ఞాన మార్గమునకు మోక్షమార్గమునకు దూరమగుచున్నారు.

కోటానకోట్లజన్మలు గడచిపోవుచున్నవి. కాలచక్రము గిరగిర తిరిగిపోవుచున్నది. ఎవరును తరించి బయటపడుటకు ధైర్యముచాలక జనులు అల్లాడిపోవుచున్నారుగదా. వీరి సంగతి ఏమి అని భగవంతుడు దయదలచి కరుణించి సాక్షాత్కారముగా ఆనాడు ఆరఘురాముడు ఆశ్రీరామచంద్రమూర్తి మానవ సంరక్షణార్థముగా మానవావతారమును ధరించి మానవకోటిని రక్షించి కాపాడెనని గ్రంథములు పురాణములు పెద్దలు చెప్పుచున్నారు. అట్లే ఇక్కడ సాక్షాత్కారముగా స్త్రీలను ఉద్ధరించుటకుగాను స్త్రీరూపముగావచ్చి స్త్రీలను అనాయాసముగా సంసారసాగరమును దాటించు

చున్నారు. ఆవిషయము ఎవరిఅనుభవము వారిదేకాని చెప్పు టకు తరముకాదు. స్వానుభవముచేత తెలియవలెను; వ్రాయు టకు చెప్పుటకు అలవికాదు; అందదు—

మహానుభావులు పెద్దలు వారిఅభిప్రాయము నీవి తగా వాయవలసిన పనియేమి అనవచ్చును. ఎవరిసంగతి వారు చెప్పుట వ్రాయుట ధర్మముకాదుగదా, అందులో పెద్దలు మహానుభావులు నివురుగప్పిన నిప్పువలె ఉన్నస్థలము తెలియ కుండా యుందురు కనుక 'నేను ఒక్కదాననే పంచభక్ష్య పర మాన్నములతో భుజించితిని నాసాటివారు అందరు అందులో పాల్గొందురుగాక' అని వ్రాయప్రారంభించితినిగాని నేను తెలి సినదాననుగాను; పెద్దననికాదు. సద్గురు దర్శనభాగ్యమున కన్ను తెరచి ఈ స్వల్పవిషయము వ్రాయుచున్నాను. వారికి తుని స్వస్థానము. పరమపావనభూమి శాన్తిఆశ్రమము. ఊరక రారు మహానుభావులు అనునట్లు అక్కడ నివాసము చేయుచు, శిష్యకోటి క్షేమము తలచుచు సర్వకాల సర్వా వస్థలలో ఆనందసమాధిలో గృహనిర్మాణ కార్యక్రమములు చక్కబెట్టుచు అతిథి అభ్యాగతులను సత్కరించుచు, ఉండిరి. వారిని చూడని వారికిగూడా అర్థమగునట్లుగా ఈరత్నమాల అను ఒకపుస్తకమును వ్రాసిరి. మనవంటివారికి అడిగినదానికి జవాబులు చెప్పుచుందురు. ఒక టైములేదు ఒక వేళలేదు. సర్వకాలములలో ఎవరు ఎప్పుడు వచ్చినా కాదని అనరు. అతిశాంతమూర్తి నియమములేదు నిష్ఠలేదు. అరటిపండు

ఒలచి_అరచేతిలో పెట్టిరిగాని అంతకన్న సంశయములేదు. వారుచెప్పిన నియమము నిష్ఠ వారికోరిక ఏమనగా వారు చేయుచున్న ప్రకారము గృహనిర్మాణ కార్యక్రమములు అందరు చక్కగా శ్రద్ధాభక్తులతోను గ్రంథకాలక్షేపముతోను సత్కాలక్షేపముతోను గురులక్ష్యము మరువకుండా సర్వము సర్వేశ్వర స్వరూపము. నాది నేను అనునదిలేదు. అను భావనతో ఆచరణరూపముగా రావలెనని చెప్పుచుందురు. అట్లు కాలముగడపవలెను తరించవలెను. ధన్యత్వమును పొందుదుము అని నూరిపోయుదురు. మానవకోటికి ఇంతకన్న సులభ మార్గము దొరకుట కష్టముగదా, వారు తరించి వారిని దరి చేరినవారికి తరించుమార్గము చూపుచున్నారు. సాక్షాత్తుగా చెప్పి చూపించి కషాయముకాచి ఇస్తున్నారు. గ్రంథములను చాలసులభముగాను మంచినీరుప్రాయముగాను రచించిరి. ఎవరికీ సంసారములో నేను నాది అనుభ్రమ భ్రాంతి అనే జ్వరములేకుండా తగ్గుటకు అనుమానములేదు. గురి కుదిరిన గాని గుణము కనిపించదు. కనుక కాలమును నమ్మలేము. సాధ్యమైనంత తొందరలో జన్మతరించుట మంచిది. అది యునుగాక ఈమానవజన్మను నమ్ముటకు వీలులేదు. నమ్మక వదలుటకూ వీలులేదు. అన్నివిషయములు గ్రంథములో నున్నవి. వారిసంకల్పములన్నీ వెదజల్లిరి. అందినవారెల్ల రత్నములవలె తీసుకొనిరి. ఇహమునకు ఉపకారార్థమునకు శరీరము అవసరము. పరమమోక్షసాధనకు ఈశరీరముతో యున్నప్పుడే తెలియవలెనుగదా, కనుక ఇప్పుడే ఈ తెలివి

చేతనే సచ్చిదానందస్వరూపమును తెలియగలరని ఆశతోచి ఈవిషయములను వ్రాసితిని గాని అంతకన్న యెక్కువయేమియు లేదు. నేనుకూడా శిష్యకోటిలో ఒకశిష్యురాలినేకాని వ్యావహారిక ఉద్యోగవిషయములతో పనిలేదు. కనుక నేను వ్రాయదలచిన మనవి ఏమనగా వారిని దర్శించి దరిచేరినవారికి లేసి వారికికూడా జగత్తులో మోక్షేచ్ఛగల సర్వమానవకోటికి సహాయార్థము సద్గురువులు కరుణించి కటాక్షించి ఇట్టిఅమృతవర్షము వంటి రత్నమాలను జగత్తులో సృష్టించిరి. వారికి సచ్చిదానంద సద్గురువులకు కృతజ్ఞత నెట్లు తెలుపవలెనో అది అనుభవరీత్యా అనుభవించవలసినదేగాని చెప్పుటకు వ్రాయుటకు అలవికాదు. ఆ భారమునేను వహించి అచ్చువేయించుటకు ఆలోచనలో యున్నాను. అదియునుగాక ఇట్టివిషయములను విచారించుటకుగాని చదువుటకుగాని సద్గురువుల సన్నిధికి చేరుటకుగాని యెవరికిని సందేహము వలదు. ఎట్టివారు ఊరకపోరు. సూక్ష్మబుద్ధిగలవారు ఒకసారి తెలుసుకొనగలరు. మధ్యములు 10 సార్లకు తెలుసుకొనగలరు. అథములు నూరుసార్లకైనను తెలుసుకొని తరించి ధన్యత్వమును పొందుదురు. సందేహములేదు. తల్లిదండ్రులకు బిడ్డలఅందరిమెడ, కరుణ ఒక్కటియేగదా, వారిస్థితినిబట్టి ఎవరికి యేవిధముగా చెప్పవలెనో అట్లుచెప్పుదురు. దానికి బిడ్డలఅందరికి సమానహక్కు ఉన్నది. కనుక ఈవిషయములో తగుదుమా, తగమా అను విచారణ అవసరములేదు త్వరపడుడు. లోకోద్ధారణ కొరకు శ్రీ సద్గురువులు రాజయోగిగారు రచించిన వివేకరత్న

మూలను అచ్చు వేయుట కొరకు వారిభారము నేను కొంత వహించి, నా తల్లితండ్రులైన దంటు సుబ్బారాయుడుగారు ధర్మపత్ని శేషమ్మగారు వీరిధనసహాయముచేత ఈగ్రంథము అచ్చువేయబడెను. ఉపనిషత్సారము అచ్చుకొరకు శిష్య కోటికి చాలశ్రమగలిగినదని దీనిసంగతి యేమిఅని గురువుల వారు సంశయగ్రస్తులై యుండగా వారిభారమును నేను వహించినాను. తప్పులు క్షమించ ప్రార్థన.

ఇట్లు

గుండు సరోజని

విశాఖపట్నం.

శ్రీః

# ఉపోద్ఘాతము

—:O:—

శ్లో. గురుర్బ్రహ్మా గురుర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీగురవేనమః.

శ్రీ జీవన్ముక్తాభిషిక్తులగు సుజనజీవుల ఉపయోగార్థమై జీవేశ్వరైక్యమును బోధించునట్టియు, ప్రశ్నోత్తరరూపముగా నున్నట్టియు ఈ వివేకరత్నమాల వ్రాయబడెను. అనగా జీవుడనగా నేమో, ఈశ్వరుడనగా నేమో జీవేశ్వరులు ఉభయులు దేని ఆధారముచేత నిలచిరో ఏ ఆధారములో కలియుదురో ఎందు లీనమగుదురో జీవేశ్వరైక్యమనగా నేమో జీవిగుణములు యెట్టివో ఈశ్వరగుణములు యెట్టివో యే గుణములు విడిచిన ఈశ్వరతత్త్వమును పొందునో ఆ సుగుణములన్నీ కూర్చుకొని జీవగుణము లనే మొలకలు తొడిమెలు తీసిన సుగుణము లనే పుష్పములనగా (వృక్షమునుంచి పుష్పములను వేరుపరచి) ఈశ్వరునకు సమర్పించునట్లు అహం వృక్షమనే శరీరత్రయ వృక్షమునుంచి (జీవి) అనే పుష్పమును వేరుపరచి ఈశ్వరునకు సమర్పించవలెను.

(శ్రీమహావిష్ణువునకు అర్పించవలెను.)

అప్పుడు ఈశ్వరితత్త్వము కలుగును. ఆస్థితికి వచ్చు సరికి సర్వభూతములు ఒక ఆత్మ అన్న భావన కలుగును.

ఆ సర్వభూతప్రేమయే ఈశ్వరప్రేమ విశ్వప్రేమ అనబడును. అట్టి సమష్టి ఈశ్వరప్రేమతో భూతసమూహమును సంఘటి చేయవలెను. అనగా పుష్పములనే రత్నములు, అట్టి పుష్ప ములు దేనిచేత గుచ్ఛబడును. రత్నములు గుచ్చుటకు ఆధార మేమిటి. అనగా దారముతో పుష్పమాలను గుచ్చినట్లు (అసిపదమనే ఆధారము) (సూత్రేమణిగణాఇవ) అనునట్లు ఆధారమనే దారముచేత (త్వం) పదజీవుడున్ను (ప్రత్యగాత్మయు) (తత్) పద ఈశ్వరుడున్ను అసిపదమనే దారము చేత కూర్చపడగా పుష్పమాల అయినట్లు ప్రశ్నోత్తరములను రత్నమాల వ్రాయబడెను. సోదరీరత్నములారా! ఈ రత్న మాలను కంఠమున ధరించి బ్రహ్మానందమును పొంద ప్రార్థించు చున్నాను. ఎట్లు కోటీశ్వరులు, లక్షాధికారులు రత్నహారము మొదలైన విలువగల హారములు కంఠమున ధరించి ఆనంద మును పొందుచు ఆకంఠహారమునందే ఇతరచింతలు లేక దృష్టి జాగ్రతగా యుంచునట్లు ఈవేదాంత ప్రశ్నోత్తరములను వివేకరత్నమాలను కంఠమున ధరించి, ఆ హారమునందే ఇతర చింతలు లేక బ్రహ్మానందనిమగ్నులై మణుల హారములో యున్న మర్మమును గ్రహించి, నిగ్రహించి మానవజన్మ పవిత్రమొనర్ప వేడుచున్నాను. ఇట్టి పవిత్రమైన మానవ శరీరము మళ్లీవచ్చుట దుర్లభము. ఇంత మంచిజన్మ, శరీరము వచ్చినందుకు కాలము వృధా పోనివ్వక జన్మ సార్థక్యమొనర్ప ప్రార్థించుచున్నాను. సోదరీమణులారా ఈ పవిత్ర మానవ శరీరమును ధరించినందుకు పరమరహస్యమైన ఈ పుష్పమాలను

ధరించి దాని విలువను పరిశోధించ ప్రార్థించుచున్నాను. నీవు ఇంత ప్రార్థించవలసిన పనియేమి అయిన ఈ మహాకలికాలములో అనేకజీవులు అగాధములో మునిగిపోవుచున్నారు. అది చూచి సహింపలేక బయటపడమని కోరుచున్నాను. తల్లులారా! ఈ మహాకరువులో యెంత ధనమున్నను చాల నట్లుగా ఈ కలియుగములో ఈ మహాకలికాలములో యెంత భక్తి జ్ఞానము లున్నను తృప్తి కలుగుటలేదుగదా కనుక ఈ రత్నమాలను స్వీకరించి తృప్తిపొంద ప్రార్థించుచున్నాను. సంసారసముద్రము అపారము భరించరానిది కనుక యెట్లైనను సంసార అగాధములోనుంచి బయటపడ ప్రార్థన. తల్లులారా ఇంకను ముందు ముందు ఘోరవార్తలు వినవలసి వచ్చును. చూడవలసి వచ్చును. కాలము ఎప్పుడు ఒక్కచూదిరిగా జరుగదు. కనుక ఈ నిత్యతృప్తికి ఖాళీ ఇచ్చుచు నిండుగా పూర్ణముగా శాన్తిగా నుండ ప్రార్థన. (పూర్ణమదః పూర్ణ మిదం) అనునట్లు ఈ పూర్ణస్థితిని పొందినవారే ఈ శరీర మను దేవాలయములో ఈశ్వర ప్రతిష్ఠ కలుగును. ఎన్ని జన్మముల కైనను సాధకుడు ఈ నిజస్థితికి స్థిరాత్మస్థితికి రావలెను. అనగా,

శ్లో. బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్మాం ప్రపద్యతే
వాసుదేవ స్సర్వమితి సమహాత్మా సుదుర్లభః.

అనునట్లు సాధకుడు అనేక జన్మలకు ఆఖరున జ్ఞాన సిద్ధిని పొందుచున్నాడు. ఏమహానీయులు సర్వజగత్తును వాసు

దేవ స్వరూపముగాను (వాసుదేవ తత్త్వముగాను) (తానే శ్రీకృష్ణపరమాత్మ అని) స్వస్వరూపమును తెలియుచున్నారో సాక్షాత్కారమును పొందుచున్నారో అట్టి నిర్మలాంతఃకరణముగల మహనీయులు ఆ నిర్మలతత్త్వమును పొందుదురు. సంశయములేదు. కాని అట్టివారు మిక్కిలి దుర్లభము. అనేకులలో ఒక్కరుండును (అప్పుడే జీవన్ముక్తి నిర్వికల్పత్వము కలుగును.) సోదరులారా! అందరికి పూర్ణజ్ఞానము స్వరూపనిష్ఠ చాల కష్టము. అందుకని శ్రమ అని విసుగుచెంది కాలము వృథా గడపకూడదు. స్త్రీలు సంసారములో యెట్లు సాధించగలరని భయపడి అధైర్యపడకూడదు స్త్రీలకు కూడా కొంత అధికారమున్నట్లు గీతలే గదా దృష్టాంతము. (స్త్రీయో వైశ్యా స్తథా శూద్రా) అనునట్లు స్త్రీలకుకూడా అధికారమున్నది. అన్ని ఆశ్రమములలోకి గృహస్థాశ్రమము చాల గొప్పది గదా (రాజవిద్యా రాజగుహ్యం) అనునట్లు రాజయోగముగాను రాజమార్గముగాను మహారాజభోగముగా జీవయాత్ర గడపుచు ఆ రాజమార్గములో గూఢార్థములు రహస్యములు గ్రహించి భక్తిమార్గముగానైనను శ్రమపడి సంసారసముద్రమును దాటి సుఖించవలెనని కోరుచున్నాను. కలియుగములో నామస్మరణే ముఖ్యము గనుక (ప్రహ్లాద భక్తి) అయినను సంపాదించి (శ్రీమహావిష్ణువును స్మరించి) మహావిష్ణువనగా యెవరో విమర్శించి భవరోగనివారణమును బడయవలెను. మాతృగర్భమును మరికిరొంప చూడని పదవి పొందప్రార్థించుచున్నాను. జనన మరణములతో గూడిన మాతృ

గర్భములో యెంత విషమున్నదో ఆ విషకూపమున నెట్లు యుండగలము సర్వేశ్వరా అని దినమునకు 24 గంటలలో ఒక అరనిముషమైనను ఆలోచనచేస్తే నేను చాల సంతోషించె దను. జననమరణ ప్రవాహములోబడి అనేకజీవులు పడుచున్న బాధలు చూచి సహింపలేక ఇంతవరకు వ్రాసితిని. తప్పులు క్షమించ ప్రార్ధన. యెట్టి విషయములు వచ్చినను లక్ష్యము చేయకూడదు. వివేకరత్నమాలను వ్రాయుటలో ముఖ్యాభి ప్రాయ మేమనగా అహంకార మమకారములతోకూడిన ఈషణత్రయములను గురించిన బంధములు కాళ్లకు తాచు పాము చుట్టుకున్నట్లు చుట్టుకొనును. ఆవిషయములలో ఏమాత్రము అభిమానము యున్నను జీవి అగాధములో పడి పోవును. ఎంత బ్రహ్మనిష్ఠునికైనను ఇది ఈ విషయము సహ జము. అయితే సహజమని అభిమానించక అప్పుడే ఆసమయ ములోనే వివేకజ్ఞానము నుపయోగపరుపవలెను. కాళ్లకు తాచుపాము చుట్టుకున్నప్పుడు యెంత తొందరగా పాము అని తెలిసి కాలు విదలించి పామును విడుదల చేసుకొనుచున్నామో ఆమాదిరిగా నెంత కఠినవిషయములు వచ్చినా లక్ష్యముచేయక ధైర్యముగా వివేకముచేత నిలబడవలెను. జారిపోకూడదు. అర్జునుడు యుద్ధభూమిలో దిగజారిపోతేనేగదా శ్రీకృష్ణపర మాత్మ అనేక విధములుగా బోధించవలసి వచ్చినది. కనుక ఇప్పుడు మనము యుద్ధభూమిలోనే యున్నాము. కనుక జారి పోకుండా ధైర్యముగా నిలబడవలెనని విషయములను ఖండించ మని మోక్షమును పొంది సుఖించమని కోరుచున్నాను. అనేక

కారణములచేత ఇంతవరకు వ్రాసితిని. సమస్తజనులు తప్పులు క్షమించ ప్రార్థన. లోకాసమస్తా స్సుఖినోభవంతు.

ఈ గ్రంథము అచ్చువేయించుటకు చి॥ సౌ॥ గుండు సరోజనమ్మగారు అధికారము వహించినారు, నాభారము వారు భరించినారు. ఎట్లనగా ప్రస్తుతం విశాఖపట్న నివాసులు బ్రహ్మశ్రీ గుండు నరసింహ శ్రీనివాస శ్రీరామమూర్తిగారైన కలక్టరుగారు వారి ధర్మపత్ని సరోజనమ్మగారి తల్లి తండ్రుల ధనసహాయముచేత ఈ గ్రంథము అచ్చువేయబడెను. ఆపుణ్యదంపతులను సర్వేశ్వరుడు శ్రీమన్నారాయణమూర్తి క్షేమ స్థైర్య అభయ ఆయురారోగ్యముగాను సకల ఐశ్వర్యాభివృద్ధిగాను రక్షించి కాపాడుగాక. ఆపుణ్యదంపతులు ఇంకను ఇట్టి లోకోద్ధారణ కార్యములుచేయుటకుగాను అనేకఆశీర్వచనములు.

ఇట్లు

సర్వజనవిధేయురాలు

**రా జ యో గి**

శాన్తి ఆశ్రమము, తుని

---

బ్రహ్మశ్రీ వేమూరి సోమేశ్వరరావుగారి పర్యవేక్షణమున
బ్రహ్మశ్రీ వార్ణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు
దయతో తప్పులు సవరించిరి.

# చదువరుల కొకమాట

వేదాంత రత్నమాల యను నీ చిన్నిపొత్తము ప్రశ్నోత్తరములుగా బ్రహ్మశ్రీ ఉప్పలూరి వీరరాఘవులు పంతులుగారి ధర్మపత్నియు ఉపనిషత్సార గ్రంథకర్త్రియు నగు శ్రీమతి "రాజయోగిగారి"చే రచించబడినది. ఈ గ్రంథము యొక్క ముఖ్యోద్దేశ మేమన స్వయంతీర్ణాఃపరాన్ తారయన్తి అనగా తాము తరించి ఇతరులను తరింపచేయుటయే.

ఇందలి ప్రశ్నోత్తరములలో వేదాంతశాస్త్రము సులభముగా తెలిసికొనుటకును, తెలిసికొన్నదానిని పూర్తిగా అనుభవములోనికి తెచ్చుకొని ఆప్రకారము వర్తించి ఇతరులకు ఆదర్శప్రాయులుగా నుండి లోకములోని స్త్రీ పురుషులకు ఈ జ్ఞానము అలవడునట్లు చేయగలందులకు అతి సులభశైలిలో కేవల శాస్త్రజన్యజ్ఞానమేగాక, అనుభవజ్ఞానముతో గూడ వ్రాయబడి గ్రంథమునందు బ్రహ్మసత్యం జగన్మిథ్య అను నంశము ఎక్కువగా విపులముచేసి సులభశైలిలో వ్రాసినందుకు గ్రంథకర్త్రిగారిని అభినందించుచు ఆమెకు ఎక్కువ ఆయురారోగ్యైశ్వర్యముల నిచ్చి కాపాడుగాక యని భగవంతు నెల్లప్పుడు ప్రార్థించుచున్నాను. లోకములో ఇట్టి మహనీయులు చాలా అరుదుగా నున్నారు. అందు స్త్రీలలో చాలా తక్కువ.

బుధజనవిధేయుడు

రాళ్లపల్లి శ్రీరాములు

Retired Teacher, Govt. Training School,
Visakhapatnam. Now at Tuni

మకాం: తుని
2—1—1951

ఓం

శ్రీసద్గురు పరబ్రహ్మణేనమః

శ్రీగణేశ శారదా శ్రీగురుభ్యోనమః

# వివేక రత్నమాల

[ప్రశ్నోత్తరము లను వేదాంతగ్రంథము]

## గ్రంథ ప్రారంభము

ప్ర : సద్గురుప్రభో! నమస్కారము. నమస్కారము. నమస్కారము.

ఉ: వత్సా, చిరంజీవ, చిరంజీవ, చిరంజీవ దీర్ఘాయుష్యమస్తు.

ప్ర: ప్రభో, జనన మరణ ప్రవాహము లోబడి దాటిగానక తామరాకు మీద నీటిబిందువువలె అల్లాడిపోవుచున్న నన్నేల చిరంజీవ అని, దీర్ఘాయుష్యమస్తు అని యట్లు దీవించెదరు.

ఉ : వత్సా, నీవు చిరంజీవివి. దీర్ఘాయుష్మంతుడవు కావా!

ప్ర : తండ్రీ, నేను ఎట్లు చెప్పగలను. చిరంజీవిని దీర్ఘాయుష్మంతుని అవునో కాదో బాగుగా తెలియుటలేదు. సందేహముగా యున్నది.

ఉ : వత్సా, సందేహమేల నిస్సందేహముగా యేదో ఒక మాట చెప్పుము. అద్దము చూచినయెడల ఒకవైపు అద్దము, ఒకవైపు మొద్దువలె కర్రగదా. అట్లే అంతఃకరణము ఒకవైపు శుద్ధము, ఒకవైపు మలినము. విషయములతో గూడినప్పుడు

మలినము. ఆత్మతో గూడినప్పుడు శుద్ధము. ఆత్మతో గూడిన సుఖము, నిత్యశాంతి. దేహత్రయముతో గూడినప్పుడు తాపము, నిత్యశత్రుత్వము. కనుక నీస్వరూపము ఆత్మతో గూడినదా విషయముతో గూడినదా. విషయముతో గూడిన జీవత్వము జనన మరణములతో గూడిన ఆభాన. వృథాప్రయాసమగును. ఆత్మతో గూడిన పరత్వము అమృతతత్వము నిత్యతృప్తి. నిత్యశాన్తి యగును. కనుక నీవు యెవరు మలినమా, శుద్ధమా. నీవు యెవరైనదీ ఆలోచించి పరిశోధించిచెప్పుము. సుఖించుము.

ప్ర: తండ్రీ, దీనదయాపర! నేను యెవరినైనదీ తెలియకున్నాను సందేహము విడువలేదు. నా ఈ దీర్ఘ సందేహము మీరే తీర్చి నన్ను ధన్యత్వమును పొందింపుడు.

ఉ: వత్సా, నీహృదయములో యున్న మాలిన్యమును బాగుగా తుడిచి పరిశోధింపుము.

ప్ర: తండ్రీ, పరిశోధించిన హృదయము ఎట్లుండును దయతో శెలవిండు.

ఉ: వత్సా, జ్ఞాని హృదయమువలె శాంతిగా నిర్మలముగా యుండును.

ప్ర: తండ్రీ, జ్ఞాని హృదయము యెట్లుండును ఇంకను శెలవిండు.

ఉ: వత్సా, నిర్మలముగా నిశ్చలముగా నిర్వికారముగా నిరామయముగా నిష్కళంకముగా నిత్యానందముగా స్వప్రకాశముగా యుండును.

ప్ర: తండ్రీ, అజ్ఞాని హృదయము ఎట్లుండును?

ఉ : వత్సా, ప్రియపుత్రా! మబ్బు కమ్మిన ఆకాశము ఎట్లుండునో ఆమాదిరిగా యుండును.

ప్ర : గురువరా, అజ్ఞాని నడత యెట్లుండును వాని లక్షణము లేమి?

ఉ : పుత్రా, జాగ్రత్తగా వినుము. ఆకాశమున దట్టముగా కారుకమ్మిన గాఢాంధకారములో పెద్ద గాంభీర్యముగా ఉరుములు మెరుపులు యున్నట్లు అజ్ఞానమనే అంధకారములోబడి దారిగానక కోర్కెలనే చిక్కుళలో చిక్కియుండును. ఆగంభీరుని నడతకు యెదటివారు భయపడి భ్రాంతిపడునట్లు నడచును.

ప్ర : తండ్రీ, అట్టి వికారస్వరూపుని యెవరైనా నమ్మెదరా వాని మాటలను యెవరైనా విశ్వసింతురా?

ఉ : వత్సా, ఆ గంభీరుని మాటను నడవడిని యెవరు నమ్మరు. యేమనగా మేఘములలో మెరుపులవలె కనురెప్పపాటున జిగ్గున మెరసి అంతలో లయమగును. ఆసమయములో వాడు పూర్వపు చీకటికన్న యెక్కువ చీకటికమ్మి తాను అగాధములోపడి యెదటి వారిని అగాధములో పడద్రోయును. కాన అజ్ఞాని నడత ఆమాదిరిగా యుండును. ఎవరును నమ్మరు. వాని నడత యెవరికిని ఆధారముకాదు. అట్టి వికారస్వరూపుని యెవరును ఆధారము కోరరు.

ప్ర : గురుమూర్తీ, నమస్కారము. అజ్ఞానిహృదయము యెట్లుండును ఇంకను శలవిండు.

ఉ : వత్సా, నిర్జనప్రదేశములో కారడవిలో, నానాజాతి అడవిజాతి కట్టెలు అనేకరకములు అనేకరూపములు అనేక

జాతి వంకర లావు సన్నము పొడుగు పొట్టిగా అనేకకట్టెలు కూడికగా ఎట్లు గుమిగూడియుండునో అట్టి ప్రదేశములలో అడుగువేయుటకు సంచారము చేయుటకు యెంతకష్టముగా యుండునో అట్లే అజ్ఞానిహృదయము అనేకజన్మలనుంచీ జన్మ జన్మార్జితదోషము లనే అనేక వాసనారూపములుగా ప్రోగుపడిన త్రివిధకర్మలు గుమిగూడగా జనన మరణప్రవాహములోబడి దారిగానక జీవయాత్రకు అంతకష్టము కలిగించును.

ప్ర : సద్గురుప్రభో, నా హృదయముకూడా అట్టిస్థితిలో యున్నదేమో అని సంశయముగాను భయముగాను యున్నది. పరమేశ్వరా నన్ను మన్నించి ఆవాసనాత్రయములో నుంచి బయటపడు మార్గము చూపవేడుచున్నాను.

ఉ : బిడ్డా, భయపడకుము, ఇప్పుడు వాసనాత్రయము లోనే యున్నావు గాని దాటగలవని తలచెదను. ధైర్యము వహించుము.

ప్ర : గురువరా, వాసనాత్రయము దాటగలవని మీరు శలవిచ్చితిరి గాని నాకు యెంత మాత్రము ధైర్యములేదు. రక్షింప వేడుచున్నాను.

ఉ : వత్సా, ధైర్యమే ముఖ్యముగా యుండవలయును. అదే పునాది దిట్టమగును. కావున సర్వకాల సర్వావస్థలయందు ధైర్యము విడువరాదు. ధైర్యము ఓర్పు యుండిన యెడల అన్నీ అప్పుడేచేకూరును. భయపడకుము; ఖంగారు పడకుము.

ప్ర : తండ్రీ, మీమాట నమ్మకము మీధైర్యమైన మాటయే నాకు ధైర్యముగాని, ఇతరము యేది చూచినా

నాకు ధైర్యము కలుగుటలేదు. ఎటు చూచినా అగాధముగాను అధైర్యముగాను కనబడుచున్నది.

ఉ : వత్సా, యేది నమ్మకపోయినా గురువాక్యమునమ్మితివి గదా ఆనమ్మకము ఆ ధైర్యము చాలును. నీవాసనాత్రయమను అడవి కట్టెలను దగ్ధము చేయుటకు గురులక్ష్యమనే అగ్నిరక్షణము ఒక్కటి చాలును.

ప్ర : తండ్రీ, వాసనలు దగ్ధమైన హృదయము యెట్లుండును. అట్టి నిర్మల హృదయమును నేను యెన్నడేని చూచెదనా?

ఉ : వత్సా, గురులక్ష్యము తప్పకుండా నేని ఆ నిర్మల హృదయమును చూచెదవు. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు ఎవరి హృదయమును బాధించకుండునో ఆ హృదయము నిర్మలముగా యుండును. అప్రదేశమే పంచవటి అనబడును. అట్టి పవిత్ర హృదయమును నీవు కోరితివేని పంచతన్మాత్రలను నీహృదయములో నుంచి కర్పూరము హరించునట్లు హరింపచేయుము.

ప్ర : పంచవటి అనగా నేమి ; ఎట్లు హరింపచేయవలెను ? మందబుద్ధిని కాన మరచితిని. మన్నించి నన్ను కృతార్థుని చేయ కోరుచున్నాను. సర్వేశ్వరా నా మందబుద్ధి యెప్పటికైనా హరించునా ?

ఉ : పుత్రా, నీ మందబుద్ధి జ్ఞానోదయము అయినయెడల హరించును. పంచవటి అనగా అయిదు వటవృక్షములు. వట బీజములు యెంత అణువుగా యుండి వృక్షము యెంత గాంభీర్యముగా యెంత పెద్దదిగా నలువైపులా పెరిగియు అవి యున్న

ప్రదేశములలో మరి యొకటి యేదీ గోచరించక యెంత బలముగా భూమిమీద యుండునో ఆ మాదిరిగా హృదయక్షేత్రముతో సంసార వృక్షమునకు కారణ బీజములను పంచతన్మాత్రలను 5 వటవృక్షములు యున్నవి.

ప్ర: గురుప్రభో, అవి యెట్లు ఛేదించవలెను. వినగ వినగ నాహృదయము భారము అగుచున్నది. వాటిని ఛేదించు యుపాయమేమి?

ఉ: వత్సా, అసంగమను శస్త్రముచేత ఛేదించవలెను. సంగవర్జనమనగా యెట్టివిషయములువచ్చినా బుద్ధిని స్థిరముగా ఉంచవలెను. బుద్ధియందు గురులక్ష్యమును దృఢముగా నిలపవలెను. స్థిరముగా నిలిపినయెడల బుద్ధిమందము హరించును. కావున తన్మాత్రలనునిగ్రహించి తన్మాత్రలకే విషయసంగతులు కలుగకుండచేసితివేని వటబీజములు దగ్ధమగును. అప్పుడు హృదయము శాన్తించును. నీ హృదయభారము నా శిరస్సుపై నుంచుము. భయపడకుము.

ప్ర: సర్వేశ్వరా, మీరుచెప్పినప్పుడు చాల సుఖముగానే యుండును గాని వ్యవహారమునకు వచ్చునప్పటికి నీవు నేను అను విషయమును నిగ్రహించుట చాల కష్టముగా యుండునుగదా యేమి యుపాయము?

ఉ: వత్సా, తొందరపడకుము. నెమ్మదిగా శాంతముగా పరిశోధింపుము. పంచభూతాత్మకమైన ఈ శరీరములో స్థిర పదార్థమేగదా నీకు గురువుఇచ్చిన లక్ష్యము. విషయము వచ్చినప్పుడు ఆ గురులక్ష్యములో చేరుము. యెట్లనగా (యథా

సంహరతే చాయం కూర్మోఙ్గానీవసర్వశః) అనునట్లు కూర్మము తన యంగములను లోపలికి తీసుకొనువిధమున బుద్ధిమంతులైన వారు విషయమువచ్చినప్పుడు విషయములో కలియక తటస్థముగాయుండి ఇంద్రియములను స్వాధీనములో యుంచుకొనవలెను. క్రమముగా అట్లుచేయగా వటబీజములు జ్ఞానాగ్నిచే దగ్ధమగును.

ప్ర: తండ్రీ, అంత గాఢముగా యున్న తన్మాత్రలు పూర్తిగా దగ్ధమగునా శేషముండునా నాసందేహము తీర్చుడు.

ఉ: వత్సా, పురుష ప్రయత్నము యెంతదృఢముగా యున్న, అంతజ్ఞానాగ్ని ప్రజ్వలించి శేషము లేకుండా దగ్ధము జేయును. (విషయములలోని విషయమును) నీవు పూర్తిగా గ్రహించితివేని నిశ్శేషముగా దగ్ధమగును. లేని యెడల విషయమును ప్రీతితో అనుభవించినయెడల శేషముండును.

ప్ర: తండ్రీ, విషయము వచ్చినప్పుడు యెట్లుండవలెను. మందమతిని మరచితిని. క్షమించి మరల శలవిండు.

ఉ: వత్సా, పదిమంది పిల్లలు వీధులో అల్లరిచేయుచుండగా ఒక చిన్నకుఱ్ఱవాడు అది చూచి తల్లివద్దకువచ్చి అమ్మా నేనుకూడా వీధులోనికిపోయి వారితో కలసి ఆడుకు వచ్చెదనని అడిగెను. అప్పుడు తల్లి వెళ్ళవద్దునాయనా అని చెప్పెను. ఏమనగా వారు. పెద్దవారు. నీవు చిన్నకుఱ్ఱవాడవు. నీవు వారితో సరికావు. వెళ్ళవలదునాయనా అని తల్లి యెంత బోధించినను వినక తల్లిమాట లక్ష్యముచేయక తల్లిని విడచి వీధినిబడి ఆ పదిమందితో ఇష్టాగోష్టిగా కొంతకాలము గడిపెను.

ప్ర: తండ్రీ, ఆ పదిమంది పిల్లలలో ఈ చిన్నకుర్రవాడు కలసెనా వేరుగా యుండెనా?

ఉ: వత్సా, నాయనా ఎట్లు కలియుగలరు. వారు పదిమంది పెద్దవారు. వీడుఒక్కడు చిన్నకుర్రవాడు. ఒక్కడు యెన్నడేని పదిమందిలో కలియునా? ఒక్కడు ఒక్కడే. అక్షోహిణీలు అక్షోహిణీలే. ఒక్కడి బలము యెక్కువ. అక్షోహిణీల బలము తక్కువ. ఈగూఢార్థము గ్రహించవలయును. వ్యవహారమునకు వారి బాధలు ఎక్కువగా యుండును. జ్ఞానికి యుండవు. అంత కొంతకాలమునకు వారితో విరోధమువచ్చి కుర్రవానికి బాధలు యెక్కువ అయినవి. యేమిచేయుటకు తోచక బాధపడుచుండగా 'పూర్వపుణ్య' సంస్కారబలము చేత తల్లివాక్కు స్మృతికి వచ్చినది. అప్పుడు అక్కడే మనస్సు పెడముఖమైనది. అనగా తల్లివైపునకు తిరిగినది. తల్లిచేసిన బోధ అప్పుడు కుర్రవానికి బోధపడినది. సుత్తిదెబ్బలు తినగ తినగ గాని రాతికి నునుపులేనట్లు విషయములవల్ల దెబ్బలు తినగ తినగ గాని హృదయలింగము బయటికిరాదు. అప్పుడు కుర్రవానికి పశ్చాత్తాపము కలిగినది. కుర్రవాడు క్రమముగా తల్లినిచేరి తాత్కాలికముగా వచ్చిన అనగా మధ్యను వచ్చిన గందరగోళము అల్లరి కష్టములు విషయములు వీటినన్నిటిని మరచి సుఖముగా నుండెను. కనుక విషయము వచ్చినప్పుడు విషయమువలె తెలిసి గురులక్ష్యములో చేరుము.

ప్ర: తండ్రీ, అంతగూఢముగా చెప్పిన గ్రహించలేను. కనుక ఆ గూఢార్థము కొంచెము విపులముగా తెలుపవేడు

-చున్నాను. కృపానిధీ! మీదయచూపవలయును.

ఉ: వత్సా, నాయనా ఎంత వెఱ్రివాడవు. నీవే ఆ కుఱ్ఱ వాడవు ఆ పదినుందివటబీజములు వటవృక్షములు. ఆ విషయ ములలోనుంచి నీవు తల్లిమాటలను ఆత్మలక్ష్యములోనికి వచ్చితి వేని నీ సర్వకష్టములు నీ సర్వదుఃఖములు శాన్తించును. అదే పంచవటీతీరమని పెద్దలు పలుకుదురు. కావున నీవు శాన్తించు మార్గమును పరిశోధింపుము. ఆత్మనుకప్పిన మలములను తొల గించి కృతార్థుడవు కమ్ము.

ప్ర: తండ్రీ, అందువలన హృదయము శాంతించిన యేమి లాభము. హృదయము పంచవటీతీరమైన యెడల యేమి ప్రయోజనము కలవిందు.

ఉ: వత్సా, ఆ కారణముచే బ్రహ్మాండనాయకు డైన అఖండ పరిపూర్ణ పరబ్రహ్మము నీ హృదయమున నిలచును. అదే పంచవటీ తీరమందు శ్రీరామచంద్రమూర్తి నివసించుట అని పెద్దలు పలుకుదురు. దానిని నీవు బాగుగా గుర్తు తెలుసుకొనుము. గురులక్ష్యము తెలియుము.

ప్ర: తండ్రీ, అఖండ పరిపూర్ణ పరబ్రహ్మము హృదయ మున నిలచిన యేమిలాభము. అజ్ఞానాంధకారము పోవునా? నాదీర్ఘ సందేహము. తీరునా? మీ అమృతోపమాన మైన వాక్కులచే నా హృదయ తాపము తీర్పుడు.

ఉ: జీవా, అందువలన నీ జీవత్వముపోయి హృదయము బ్రహ్మాకారము అగును. అప్పుడు ఈశ్వరత్వము కలుగును. అదే జ్ఞానాగ్ని అనబడును. ఆ జ్ఞానాగ్నిచే విషయములు దగ్ధము

లగును. పరమశాన్తి కలుగును. అది నీవు ఇతరచింతలులేక వ్యర్థసంభాషణలేక గురులక్ష్యముచే గుర్తించుము. హృదయము శాన్తిలేనియెడల యేమీప్రయోజనములేదు. కనుక ముందుగా శాన్తివహించుము. తరువాత నేర్పుగా సాధించుము.

ప్ర: దయాసముద్రా, అప్పుడు జగత్తు ఎట్లు గోచరించును. సర్వభూతములు ఎట్లుండును? మీదయకు పాత్రుడను. మీపాదసేవకుడను దయతో శెలవిండు.

ఉ: వత్సా, సర్వభూతములు ఈశ్వరత్వముగానే తెలియబడును. గజదొంగకు పదార్థలక్ష్యమేగాని నామ - రూపములను చూడడుగదా! ఇది సువర్ణము. ఇది మన్ను - అన్న వివేకజ్ఞానమేగాని నామరూపములతో ప్రయోజనములేదు. ఎట్లనగా (వాచారమ్భణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యం) అనునట్లు నామరూపములను ఖండించి స్థిరపదార్థమును తెలియునుగదా. అట్లే సర్వజగత్తు సాధుత్వముతోను నిశ్చలముగాను తెలియగలవు. సర్వభూతములను ఈశ్వరభావముతో తెలియుటే ఈశ్వరత్వము. అప్పుడు నీ హృదయము ఈశ్వరత్వమును పొందును.

ప్ర: శాన్తినిలయా, సర్వభూతములను ఈశ్వర ప్రేమతో తెలియు నప్పుడు హృదయము యెట్లుండును. ఇంకను శెలవిండు. మీ కరుణా కటాక్షవీక్షణములచే రక్షింపుడు.

ఉ: పుత్రరత్నమా — శత్రు మిత్ర భావనతో చూచుట జీవత్వము. ఆ శత్రుమిత్ర భావన వీడిన ఈశ్వరత్వముతో తెలియబడును. అప్పుడు సర్వభూతములు తన దృష్టికి స్వచ్ఛ

మైన తొడిమెలు తీసిన పుష్పమువలె అనగా చెట్టునుంచి వేరు పరచిన పుష్పమువలెను తెలియగలడు. అప్పుడు తానుకూడ ఆ పుష్పమువంటివాడే గదా అన్న ఆ భేదము తెలిసి ఆపుష్పములలో తానుకూడ కలియును. దేని ఆధారముచేత తాను ఆ పుష్ప సమూహములో కలిసెనో గురులక్ష్యముచే గుర్తించ గలడు. అప్పుడు ఈపుష్పము వేరు అన్న ఆభాసపోయి పుష్ప సమూహములో కలియును. అవే రత్నములు. దేని ఆధారము చేత ఈపుష్పములు (రత్నములు) కూర్చబడునో ఆ ఆధారమే అసిపద మనబడును.

ప్ర : సర్వేశ్వరా, అసిపద మనగా యెట్లుండును. ఆపదవి యెట్లు తెలియగలను దాని లక్షణమేమి? తెలుప వేడెదను.

ఉ : ప్రియపుత్రా, అది అవాజ్మానస గోచరము వాక్కుచేగాని యేఇంద్రియములచేగాని చెప్పశక్యముకాదు. అనుభవైక వేద్యము, చక్కెర యొక్క మాధుర్యము అనుభవించ వలసినదేగాని ఆమాధుర్యము ఇంద్రియములచే చెప్పవీలులేదు. గదామరి యెట్లనగా బుద్ధిమంతులైన సాధకులు గోవులోనుంచి క్షీరమును యెట్లు తీయుదురో అట్లు గురుబోధ యను అమృతమును గురు కరుణా కటాక్షవీక్షణములద్వారా చమత్కారముగా నేర్పుగా గజదొంగవలె వస్తుతత్వమును తీసుకొని హృదయములో జాగ్రత్తగా నిలిపి చక్కెరలోనున్న మాధుర్యమువలె తెలియవలెను. అప్పుడు వాని లక్షణములు యెట్లుండుననగా సర్వము శాన్తించి పిచ్చివానివలెను పసి బిడ్డలవలెను నిరాధారముగా యుండును.

ప్ర : గురుమూర్తీ, నిరాధారముగా ధ్యానించవలెనా, ఆధారముగా ధ్యానించవలెనా ?

ఉ : వత్సా, కొంతవరకు ఆధారముగా ధ్యానించవలెను. ఆతరవాత ఆఆధారము అవసరముండదు. ఎట్లనగా గోవుమనకు లొంగనప్పుడు తాడుచేబంధించి క్షీరమును తీయుదుము. క్రమముగా గోవు మనకులొంగి నిలిచినప్పుడు సాధుత్వముపొంది నప్పుడు తాడుచేబంధించ నవసరములేదుగదా కనుక పశువు అనే మనసు మనకు లొంగేవరకు ఆధారము యుండవలయును. తరువాత అవసరములేదు.

ప్ర : తండ్రీ, ఎంతకాలము ఆధారము యుండవలయునో మరల శెలవింపు.

ఉ : వత్సా, నీచిత్తము దృఢము అయేవరకు ఆధారము యుండవలయును.

ప్ర : దీననాధా, చిత్తము దృఢము లేనప్పుడు యెట్లుండును ? మీకరుణారసముచే చూపవేడుచున్నాను.

ఉ : వత్సా, చలనముగా యుండును. నేను ఇంత గొప్పవాడను, ఇంతబలముగలవాడను, నాబలము చేతనే నేను మోక్షమును పొందగలను. అని విపరీతభావనలలోబడి దారిగానక సముద్రమున కెదురీదుటకు ప్రయత్నించును. రెక్కలలో బలము యున్నంతవరకు గర్వముతో యుండును.

ప్ర : తండ్రీ, సముద్రమున కెదురీదువాడు వొడ్డుచేరునా, నడిసముద్రములో మునుగడుగదా, వాని గతి యేమగును ?

ఉ : వత్సా, పూర్వజన్మ పుణ్యసంస్కారము బలముగా

యున్నయెడల యెన్ని కష్టములు వచ్చినా సంసార సముద్ర ములో మునుగుతూ తేలుతూ బుడకలు వేస్తూ క్రమముగా వొడ్డుచేరును. ఆపుణ్య సంస్కారము లేనివారు మునిగిపోవుదురు.

ప్ర: గురుమూర్తీ, పుణ్యసంస్కార మున్నవారు యెట్లు దాటగలరు. లేనివారు యెట్లుమునిగిపోవుదురు?

ఉ: బిడ్డా, పుణ్య సంస్కారము యున్నవారు కొంత కాలము నేను ఇంతబలము గలవాడనుఅని గర్వించి అహంకార మమకారములను 2 తెడ్లతో నావను నడిసముద్రము లోనికి నడ పును. అంతవరకు అహంకార మమకారములను 2 తెడ్లఆధార ముతో వచ్చును. నేను అన్నపట్టుదల నేను మోక్షముపొంద వలెను అన్నకోర్కె. పట్టుదల అనుభావనలో అహంకార- మమకారములు యున్నవని తెలియుము. అప్పుడు నడిసముద్ర ములకు వచ్చుసరికి ఉక్కిరిబిక్కిరిఅయి దారిగానక అహంకార మమకారములను 2 తెడ్ల యుపయోగములేక. అనగాఇక్కడ (గజేంద్రుడు ద్రౌపతి) దృష్టాంతము తెలియుము. వీరి ఇద్దరి భావనలోను కొంతవరకు గొప్ప అహంభావన యున్నదని తెలి యుము (ప్రహ్లాదునిలో ఆ అహంభావనలేదు. అందుచే ప్రహ్లాద భక్తిచే నిర్మలభక్తిచే మోక్షము పొందవలెను.) నడిసముద్ర ములో మునిగిపోవుటకు సిద్ధమై కొట్టుకొను సమయములో, పుణ్యసంస్కార మున్నవానికి భగవన్నామము (నిజనామము) గోచరము అగును. దానిని ఆధారము చేసుకొని తనసర్వము పరమేశ్వరునకు ధారపోయును. అప్పుడు ఈశ్వర కటాక్షము కలుగును. వొడ్డుచేరును. సర్వము పరమేశ్వరునిలో కలియును.

అప్పుడు నేనుఅన్న అభానపోయి, కృతార్థుడగును. ఆపుణ్య సంస్కారము లేనివారికి ఈశ్వర కటాక్షము కలుగదు. నడి సముద్రములో మునుగుదురు.

ప్ర : తండ్రీ, జీవుని ఉపాధులైన మలిన గుణములనే యెక్కువగా శలవిచ్చెదరు గాని పరమాత్మను గురించి విపుల ముగా బోధించుటలేదు. ఎందుచేతను ప్రకృతి గుణములు అంత యెక్కువగా యుండునా ?

ఉ : వత్సా, అవును: మలిన గుణములు యెక్కువగానే యుండును. బీరకాయపీచువలెను, తలవెంట్రుకల చిక్కువలెను భూమిమీద తీగెలతవలెను. మాయాఆవరణ యెక్కువగా యుండును. అదినీవు వివేకముచే చూచితివేని ఆచిక్కుతొలగును. అప్పుడుపరమాత్మ విశదమగును. మాయనుతొలగించు వరకే నీకు బోధించవలెను. నీవు పురుష ప్రయత్నముచే మాయను తొలగించవలెను. ఆపైని మాయవిడిన తరువాత పరమాత్మనీకు కరతలామలకమగును. అప్పుడు నీప్రయత్నము గాని గురుబోధగాని అవసరము యుండదు. మబ్బువీడిన సూర్యునిరీతిగా తెలియును. వత్సా మబ్బుయేమైనా విడినదా లేదా ?

ప్ర : గురువరా, మీ కరుణాకటాక్షమను సూర్యోదయమైనపుడు యేమిలోప ముండును. అంతా మీకృపయేగదా, కావున మీకృపకుపాత్రుడను. పూర్తిగా సందేహము విడువలేదు. బీరకాయపీచు అనగానేమి, ఆ చిక్కుయెట్లు ఆవరించును, ఆచిక్కు యెట్లువీడును ? బోధింపుడు.

ఉ : పుత్రా, ఒకవృక్షము యున్నదనుకో. ఆవృక్షమునకు మొదటనుంచి చివరవరకు తీగెలత దట్టముగా యెట్లు అల్లుకొని వృక్షము కనపడకుండా యెట్లుండునో ఆమాదిరిగా జీవునికి అజ్ఞానమనే ఆవరణ విక్షేపశక్తులచే కప్పియుండును. ఆ అజ్ఞానము ను వివేకము అను ఖడ్గముచే ఆయుధముచే ఛేదించవలెను. అప్పుడు ఆచిక్కు తొలగును. నీసంశయములు తీరును.

ప్ర : శాన్తినిలయా, ఎంతవరకు చిక్కు తొలగించవలెను. అప్పుడు స్వస్వరూపము యెట్లుండును. దయచూపుము.

ఉ : వత్సా, శుద్ధోదకముకొరకు నాచు తొలగించునట్లు అజ్ఞానమును చిక్కు శేషములేకుండా తొలగించవలెను. అప్పుడు స్వరూపజ్ఞానము కలుగును. ఆపైని చిక్కుయుండదు. తొలగించవలెనని బుద్ధియు నుండదు. స్వరూపజ్ఞానములోనే నీవు లీనమగుదువు. ఆ అఖండ పదవిమాటలచే చెప్పవీలులేదు. స్వానుభవముచే స్వారాజ్యము అనుభవము కావలెను. ఆచిక్కు తొలగించువరకే నీ ప్రయత్నముగాని ఆతరువాత నీ ప్రయత్నము అవసరములేకనే స్వస్వరూపము కరతలామలకములగును. వత్సా, నీ అంతఃకరణకు పట్టిన అహంకార మమకారములు రాగద్వేషములు మోహపాశములు అను మాలిన్యమును నీవు నిత్యానిత్య వస్తు వివేకముచే పరిశోధించితివేని మలినములు తొలగును. వత్సా, ముఖ్యసంగతి ఒక్కటి చెప్పెదను వినుము. నీ హృదయమునకు శాన్తి లేనియెడల నీకు యేదీ బోధపడదు. కనుక మొదట భక్తిచే భగవన్నామముచేసి దానిచే నీ హృదయము శాన్తిపరుచుము. తరువాత అన్నీ అప్పుడే కలుగును.

చీకటిప్రదేశములో యేదీ గోచరముకాదుగదా! జ్యోతి వెలిగించినయెడల సర్వము విశదమగును. అట్లే భగవన్నామము భక్తితో చేసినయెడల అఖండజ్యోతి వెలుగును. దానిచే సర్వము నీకు విశదమగును. కనుక శాన్తివహింపుము. తొందరపడకుము.

ప్ర: తండ్రీ, వత్సా వత్సా అని అంతవాత్సల్యముగాను అంత పుత్రప్రేమగాను అతిదయతోను బోధించుచున్నారు. ఈ అణుస్వరూపునియందు మీకు యెందుకు ఇంతదయ ఒక్కమాట అడిగేసరికి అమృతవర్షము నాపై కురిపించుచున్నారే. మీ ప్రేమరసమునకు అంతము హద్దు లేదుగదా దీనదయాపరా! ఈ దీనునియందు యెందుకు ఇంతదయ చూపుచున్నారు. నాకు తెలియుటలేదు. చాల ఆశ్చర్యముగా యున్నది.

ఉ: వత్సా కుమారా, నీవు తృణము మొదలైనఅనేకవిధములైన మేపు గోవునకు పెట్టినప్పుడు నీయందు ఒక విధమైనప్రేమ కలిగి ఆగోవు నీకు క్షీరము ఇచ్చునటుల పూర్వజన్మ సంస్కారబలము నీలో యెక్కువగా యుండుటవలన నీచిత్తచలనములను విషయవృత్తులు వాసనాత్రయమును నీవు తృణప్రాయముగా విడిచి సద్గురుమూర్తిని నీవు శరణుపొందుటవలన నీజన్మసంస్కారబలముచేత అమృతవర్షము నీయందు కురిపించెను. ఆకారణముచే నీయందు అంతప్రేమ దయకలిగినది. అంతవాత్సల్యము కలిగినది. నీలోయున్న విషయవృత్తులు విడుచుటచేతను పరమేశ్వరుడు నీకు అమృతవర్షమును ఇచ్చెను. వత్సా, నీలోయున్న మహిమయేకాని నాలో యేమీ లేదుసుమా!

ప్ర: దయానిధీ, ఇది నామహిమకాదు. మీ దయవల్లనే నాకు జ్ఞానోదయమైనది. మీకు యెందులకు ఇంతదయ వాత్సల్యము కలిగినది. నా జన్మ అంతా మలినమేగదా! ఇంతమాయతోను మలినముతోయున్న నాయందు మీకు ఇంతదయ కలిగినది. వత్సా, అన్నమాట వినేసరికి బ్రహ్మానందము కలుగుటకు కారణమేమి?

ఉ: పుత్రా, వత్సా, ఇటుచూడుము గోవత్సన్యాయమును నీకుచెప్పెదను వినుము అర్థము అగును.

ప్ర: తండ్రీ, నేను గోవత్సన్యాయమును వినుటకు తగుదునా?

ఉ: వత్సా, నీవు వినతగుదువు. సందేహము లేదు. గోవు యున్నదనుకో, ఆగోవువద్ద దానిదూడ అనేకవిధములైన మలినములతో అమ్మా అమ్మా అని అరచుకొనుచు క్షీరముకొరకు తల్లిదగ్గరగా చేరును.

ప్ర: తండ్రీ, దీనదయాపరా, అంతమలినముతోను మురికితోను దూడ తల్లిని చేరినప్పుడు గోవు తన్నలేదా ఎట్లు క్షీరము నిచ్చెను?

ఉ: వత్సా, అదే తెలియవలసిన పరమరహస్యము. దూడ యెంతమలినముగావచ్చినను గోవు శాంతముగాను వాత్సల్యముగానుయుండి దూడను చేరతీయును. ఈ రహస్యము యెవరును గ్రహించలేరు. గోవు తన్నును అన్న విపరీతభావనయేగాని దూడను వాత్సల్యముగా చేరతీయునని యెవరు గ్రహించలేరు సుమా!

ప్ర: తండ్రీ, గోవు దూడను అంతశాంతముగాను వాత్స

ల్యాముగాను చేరతీయునా?

ఉ: వత్సా, అవును శాంతముగానే చేరతీసి దూడను అనుసరించిన సర్వమలినములను శుభ్రముగా హరింపచేయును.

ప: తండ్రీ, దేనితో శుభ్రపరచును. యెట్లు శుభ్రపరచును. విశదపరుపవలెను.

ఉ: వత్సా, దేనితో శుభ్రపరచుననగా, ఎప్పుడు దూడ అతిప్రేమతో తల్లివద్దచేరి క్షీరముకొరకు బాధపడునో అప్పుడే దూడయందున్న వాత్సల్యముచేత గోవు దూడనుచేరదీసి తన నాలుకతో దూడసర్వమలములను హరింపజేసి క్షీరమునిచ్చి రక్షించును.

ప్ర: దయాసముద్రా, ఆ ప్రకారముగా మీరు నన్ను చేరదీసి రక్షించెదరా, అమృతమను ఇచ్చెదరా?

ఉ: వత్సా, తప్పక సర్వేశ్వరుడు నీకు అమృతమునిచ్చి రక్షించును. నీవు సర్వేశ్వరుని కృపకు పాత్రుడవు అగుదువు. సందేహములేదు.

ప్ర: దీనదయాపరా! ఎట్లు సర్వేశ్వరునికి దయకలుగును. ఈదీనుని మలినము యెట్లు హరించును. శలవిండు.

ఉ: వత్సా, నీవు దూడవలె తొందరగా అమృతపదవికి పరమేశ్వరునిదరిచేరితివేని నీ సర్వమలినములు శ్రీ మహావిష్ణు స్వరూపుడైన ఉత్తమపురుషుడు హరింపచేయును.

ప్ర: తండ్రీ, ఎట్లు హరింపజేయును నేను ఎట్లు తెలియగలను?

ఉ: వత్సా, బీజాక్షరములను శ్రీ హరినామము. (నిజ నామము) నీకు ఉపదేశింతును. అప్పుడు నీకు క్షీరమను

అమృతము దొరకును. అది నీవు తెలియగలవు. సందేహము లేదు. భయపడకుము, శాంతించుము.

ప్ర : తండ్రీ, గోవులోనుంచి క్షీరము వచ్చినట్లు పర్వేశ్వరునిలోనుంచి అమృతము యెట్లు వచ్చును?

ఉ : వత్సా, గోవు అనే పరమాత్మ క్షీరనిలయములనే 4 వేదములు. క్షీరముఅనే అమృతము దూడ అనే జీవుడు దూడ తల్లినిచేరినట్లు జీవుడు పరమాత్మను చేరును. అప్పుడు జీవుని సర్వమలినములను సర్వవాసనలను తుడిచి అమృతమును స్థిరపదవి ఇచ్చి రక్షించును. వత్సయందున్న ప్రేమ ఇప్పుడు నీకు తెలిసినదా.

ప్ర : తండ్రీ, తెలిసినది మీ కరుణారసమునకు హద్దులేదని తెలసినది. మీదయారసమును ఇంకను శలవిండు.

ఉ : వత్సా, గోవత్సన్యాయమును గ్రహించితివిగదా, అట్లే జీవుడు పశ్చాత్తాపపడి సర్వేశ్వరునిదరిని చేరినయెడల తప్పక అమృతమునుఇచ్చి రక్షించును. సందేహమునులేదు. ఆలస్యము లేదు. దూడ యెప్పుడు తల్లినిచేరితే అప్పుడే క్షీరమును ఇచ్చునుగదా. అట్లే నీవును పరమేశ్వరునిదరిచేరి అమృతమును పొందుము.

ప్ర : తండ్రీ, ఆ అమృత పదవిని యెట్లు తెలియ గలను. దయతో శలవిండు.

ఉ : వత్సా, ఆ అమృతరసమును నీవు చెరకురసమువలె, ఆమాధుర్యము అనుభవైకవేద్యమేగాని, మాటలచే చెప్ప వీలులేదు.

ప్ర : తండ్రీ, అమృతరసమునకు, చెరుకురసమునకు సంబంధ మేమి? తెలుపవలెను.

ఉ : వత్సా, చెరుకువిల్లులోపలరసము యెట్లుండునో, నీలో, లోపల అమృతరసము యున్నది. చెరుకువిల్లులోనిరసమును తెలియునట్లు, (నీలోని రసమును) తెలియుము. వివేకముచే విమర్శింపుము.

ప్ర : తండ్రీ, ఆ గూఢార్థము కొంచెము విశదపరచి తెలుప వేడుచున్నాను.

ఉ : వత్సా, చెరుకు విల్లునకు అడుగడుగునా కణుపులతో స్థూల సూక్ష్మకారణములతో యెట్లుండునో ఆ మాదిరిగా నీలో షట్చక్రములను కణుపులతో లోపలగా రసస్వరూపుడైన అమృత స్వరూపముయున్నది. దానిని తెలియుము. గీతలలో శ్రీకృష్ణపరమాత్మ పార్థునకు నీలో చూడు నాలో చూడు సర్వములోను చూడుమనిన గూఢార్థము అదే సుమా బాగుగా పరిశీలనచేసి తెలియుము.

ప్ర : తండ్రీ, షట్చక్రములలో నున్న రస స్వరూపమును యెట్లు తెలియగలను?

ఉ : వత్సా, చెరుకు తాలూకు పైనున్న తుక్కును లోపలనున్న పీచును 2 పన్నులతోను నమలి పీచును వేరుచేసి రసమును తీయునట్లు స్థూల సూక్ష్మములను శరీరచిక్కును జ్ఞాన, విజ్ఞానములను 2 దంతములచే పరిశీలించి రస స్వరూపుడగు కారణ పురుషుని తెలియుము.

ప్ర :తండ్రీ, రసము చెక్కరయెట్లగునో దయచూపవేడెదను.

ఉ: వత్సా, కుమారా, కారణ పురుషుని బాగుగా గుర్తింపుము. కారణ శరీరమును కూడా తొలగించుము అనగా స్థూల సూక్ష్మములు నేను కానని తొలగించుము. అప్పుడు నేను అన్న ఆభాసముపోయి అఖండాకారములో కలియును. అనగా యేకారణము చేత దేహేంద్రియములు వ్యాపారము చేయుచున్నవో లోపల కారణము గుర్తించుము. ఆ అఖండాకారము కూడా మరచిపోయినదే చక్కెర అనబడును. అనగా రస స్వరూపము అగ్నిస్పర్శచే ఘనీభూతమై గడ్డకట్టినప్పుడు చక్కెర అనబడునుగదా. ఆమాదిరిగానే జీవస్వరూపము జ్ఞానాగ్నిస్పర్శచే పరత్వముగా తెలియుగలవు. ఎట్లనగా జీవస్వరూపముగా యున్నప్పుడు రసమువలె చలనముగా యుండును. ఆ చలనము జ్ఞానాగ్నిచే నిలచిపోయినప్పుడు రసము ఘనీభూతమైనట్లు రసము చక్కెర అయినట్లు చలనము అచలపరిపూర్ణము అగును.

ప్ర: తండ్రీ, చెరుకు విల్లులోనుంచి చక్కెర తీయునట్లు ఈశరీరములోనుంచి చక్కెర అను అమృతమును వెలువరించమనిగదా మీరు శెలవిచ్చితిరి.

ఉ: వత్సా, అవును నీవు బాగుగా గ్రహించితివి. చాల సంతోషముగా యున్నది. యెట్లైన శ్రమపడి అమృతమును సంపాదించుము. నిత్యానందమును పొందుము.

ప్ర: తండ్రీ, దయానిధీ, ఆ అమృతపదవిలో యున్నవానికి పూర్వవాసనలశేషము అంటదా.

ఉ : వత్సా, అంటదు. విషయమునందు లక్ష్యములేని యెడల అంటదు.

ప్ర : తండ్రీ, ఎట్లు అంటదో విశదపర్చ వేడుచున్నాను.

ఉ : వత్సా, పసిబిడ్డవలె జ్ఞానికి యేదీ అంటదు.

ప్ర : తండ్రీ, పసిబిడ్డలకు జ్ఞానికి సంబంధము యెట్లుండును?

ఉ : వత్సా, పసి బిడ్డలకు యెన్ని దెబ్బలు తగిలినా లక్ష్యము చేయరు. ఏమనగా నెత్తురు బలము యెక్కువగా యుండును. అట్లే జ్ఞానికి యెన్ని దెబ్బలు తగిలినా గురు లక్ష్యములోనే యుండును గాని దెబ్బ తగిలినదని విచారించడు. ప్రహ్లాదునివలె తెలియుము. దైవబలము యెక్కువగా యుండును.

ప్ర : కృపానిధీ, శాఖాచంద్ర న్యాయమని పెద్దలు శెల విచ్చెదరు. దానిని వివరించ కోరుచున్నాను.

ఉ : వత్సా, శాఖాచంద్ర న్యాయమనగా శాఖలమధ్య నున్న చంద్రుని దర్శించుట అనగా అట్టి స్థితికి వచ్చువారు చంద్రరేఖను ధరించిన శంకరుడని కొందరు పెద్దలభిప్రాయము. అనేకులు అనేక విధములుగా పలుకుచురు. యెవరి అభిప్రాయము వారికి ప్రీతి.

ప్ర : తండ్రీ, అవునుగాని, శాఖలమధ్యనున్న చంద్రుని దర్శించినంతమాత్రమున, శంకరులు యెట్లగును. శంకలు తీరుట చేత శంకరుడనియా, మీ అభిప్రాయము. చాలఆశ్చర్యముగా యున్నదే.

ఉ : వత్సా, వినుము: అవును ముమ్మాటికి శంకలుతీరుట

చేతనే, శంకరుడగును. శంకలు అనగా: నేను స్త్రీని. నేను సంసారిని. నాకు బంధముయున్నది. అన్న అనుమానములు సందేహములు, మానాభిమానములేగదా. ఆ దుర్గుణములు లేనివారు ఈశ్వరసమానులే సందేహములేదుసుమా, శాఖా చంద్రన్యాయమనగా చంద్రరేఖను ధరించిన శంకరుడనగా, ఒక్కటే. యెట్లనగా ఒకవృక్షము యున్నదనుకో, ఆ వృక్షమునకు యెదురుగా చంద్రోదయమైనది, క్రమముగా చంద్రుడు శాఖలమధ్యకు వచ్చుసరికి శాఖలు అడ్డువచ్చుటచేతను శాఖలు కదలుటచేతను చంద్రదర్శనము కాలేదు. చంద్రదర్శనము కొరకు పరితపించుచున్నవానికి వానిఆతురతను కనిపెట్టి ప్రక్కనున్న ఒకబాటసారి యేమినాయనా అట్లు పరితపించుచున్నావు. అని అడిగెను. అప్పుడు ఆ సాధకుడు తండ్రీ చంద్రదర్శనము కొరకు తపించుచున్నాను. శాఖలు చలించుటచేతను చంద్రదర్శనము కాలేదని చెప్పెను.

ప్ర: తండ్రీ, బాటసారి యేమిచెప్పి వానిసందేహముతీర్చెను?

ఉ: వత్సా, నీవుకొంతవరకు వృక్షమువద్దనే స్థిరముగా నిలచినయెడల శాఖల చలనము తగ్గును. అప్పుడు శాఖలలోనున్న చంద్రుడు నీకు దర్శనము అగును. ఆ శాఖలమధ్యనున్న చంద్రునియందు నీ దృష్టినిలిపి, అలాగ చూచుచుండగా క్రమముగా ఆ చంద్రుడు శాఖలను వృక్షమునుదాటి పైభాగమునకువచ్చును. అప్పుడు నీకు శాఖలడ్డుగాని, శాఖలచలనముగాని వృక్షము అడ్డుగాని లేక స్వచ్ఛముగా దృష్టికి యెదురుగా చంద్రదర్శనమునీకు అగునుగదా. అదేచంద్రరేఖ అనబడును.

అనగా నీకు గొప్ప ఆనందము శీతలము కలుగును. శాఖలలో నుంచి చంద్రుని దర్శించుటవలన శాఖాచంద్రన్యాయమని చెప్పబడును. ఆ ఆనందము. శీతలముచేత. శరీరత్రయ వృక్ష వర్గమైన తాపము శాన్తించును.

ప్ర: దయానిధీ? అయితే చంద్ర రేఖను ధరించిన శంకరుడు యెట్లగును?

ఉ: వత్సా, అట్లే అదే ప్రకారము జీవిఅనే సాధకుడు చంద్రుడనే ఈశ్వరుని దర్శించుటకు, శరీరమనే వృక్షము ఇంద్రియసమూహమనే శాఖలు ప్రారబ్ధమనే చలనముచేచలించు చున్నప్పుడు చంద్రుడు స్వచ్ఛముగా తెలియనట్లు, ఈశ్వర తత్వము స్వచ్ఛముగా తెలియుటలేదు.

ప్ర: తండ్రీ, స్థిరత్వము కలుగును. ఈశ్వరత్వము యెట్లు తెలియబడును.

ఉ: వత్సా, విషయవృత్తి కొంచెముతగ్గి, ఇంద్రియభోగ ములయందు విరాగము కలిగి, ఈశ్వరతత్వమునందు స్థిరధ్యాన మను అభ్యాసములో యున్నయెడల చలనముతగ్గి క్రమముగా చంద్రుడనే ఈశ్వరుడు సాధకునకు దృష్టికి యెదురుగా తెలియ బడును. అదే ఈశ్వరత్వము. అనగా చలనముతో గూడిన జీవలక్షణములను విడిచి నిశ్చలత్వముతో గూడిన ఈశ్వరలక్షణ ములతోగూడిన ఈశ్వరత్వము కలుగును. శంకరుడు చంద్ర రేఖను ధరించునట్లనగా అధ్యాత్మతో గూడిన తాపత్రయము శాన్తించి, శీతలముగా యుండును. (కోటి చంద్రశీతలము) అనునట్లు, శాన్తిగాయుండును. ఆ కారణముచేత చంద్ర శేఖరు

డని చెప్పబడును. చంద్రశేఖరుడనగా, తాపత్రయము శాన్తించి సంసారతాపముతగ్గి, ఈశ్వరత్వమును పొందిన 24 తత్వములను ఖండించిన లక్ష్యార్థమని తెలియుము.

ప్ర : తండ్రీ, అప్పుడు ఈశ్వరత్వము కలుగునని దృష్టాంత మేమి ఆశాన్తి పూర్ణశాన్తియెట్లగును? పూర్ణశాన్తి యెట్లు కలుగును.

ఉ : వత్సా, ఈశ్వరత్వము కలుగుటకు దృష్టాంతరము యేమనగా (సహస్రారాంతర్గత శివశక్తిస్వరూపాయ నమః) అను మహా వాక్యమే ప్రమాణము. తప్పక ఈశ్వరత్వము కలుగును. అనగా భాగత్యాగమని తెలియుము. దేహేంద్రియము లను విభాగించిన శేషించిన పదార్థమును తెలియుము. దృష్టికి యెదురుగా యున్న చంద్రుడు పౌర్ణమిరోజు చంద్రునివలె పూర్ణబింబము భ్రూమధ్యస్థానమును దాటి సహస్రారమును దాటిన పూర్ణబింబమువలె పూర్ణానందముగా పూర్తిగా శాన్తించును. పూర్ణచంద్రునివలె గొప్పశీతలముగా యుండును. త్రిపుటి వర్గమైన తాపము శాన్తిపొందును. సహస్రారమునకు చంద్రుడు వచ్చునరికి యెంత శీతలముగా యుండునో పూర్ణ శాన్తి కలిగినప్పుడు అంత శీతములగాను అంత నిర్మలముగాను యుండును.

ప్ర : కృపానిధీ, ఆ పూర్ణశాన్తిని పొందుటకు దేశకాల నియమములు యేమైనా యుండవలయునా సాధకుని వీలును బట్టి వీలైన టైములో పూర్ణశాన్తి పొందవచ్చునా?

ఉ : వత్సా, శాస్త్రజ్ఞానము గురుబోధ మనసుకి దృఢముగా

నాటిన యెడల అనగా గురుశా(స్త్రములు నీకు దేనిని గురించి బోధించుచున్నారో ఆరహస్యము నీ మనసుకి దృఢముగా నాటినయెడల దేశకాల నియమములు యుండవు. నీవు చెరువుకి పోయి నీ యిష్టానుసారము నీరు యెట్లు తీసుకువచ్చెదవో ఆ మాదిరిగా చేయుము. నీకు నీటియందు తొందర యుండ వలయునుగాని చెరువునీరు సర్వ కాలముల యందు అక్కడేయుండునుగదా. అట్లే నీకు యెప్పుడు వీలైతే అప్పుడు నీవీలునుబట్టి యెవరికిని బాధలేకుండా చెరువుకి పోయి నీరు యెట్లు తీసుకు వచ్చెదవో ఆ మాదిరిగా నీ వీలునిబట్టి నీవు అమృతానంద తీరములో నుంచి నీయిష్టాను సారము అమృత జలము తృప్తితీర దాహము తీసుకొనుము. వ్యాపారము తాలూకు తాపము శాన్తించును.

(ప్ర : తండ్రీ, దేహవాసనలు చాలా బలముగా దుర్వాసనలతో నిండియుండునుగదా. ఆదుర్వాసనలు యెట్లు హరించును.

ఉ : వత్సా, ఇంటి దొంగను ఈశ్వరుడైన కనలేడు అన్నట్లు ఇంటిలో దొంగయున్న యెడల ఈశ్వరుడు కూడా కనిపెట్ట లేడుగదా. సర్వసామగ్రి హరించును. అట్లే వెన్నదొంగఅయిన శ్రీహరి <u>శ్రీకృష్ణపరమాత్మ శ్రీమహావిష్ణువు</u> అను గజ దొంగను హృదయములో స్థిరముగా యున్నయడల నీసర్వ వాసనలు అపహరించును. నాయనా, కనుక శ్రీకృష్ణపర మాత్మను హృదయములో స్థిరముగా నిలుపుము. వత్సా వాసనలేని అనగా సువాసనలేని అనేక పుష్పములలో ఒక్క

మల్లెపుష్పముగాని ఒక్క సంపెంగ పుష్పముగాని యున్న యెడల ఆ సువాసన అనేక పుష్పములలో యెట్లుకలియునో ఆప్రకారము ఈశ్వర గుణములనే సువాసన యొక్కటి యున్న యెడల జీవగుణములనే అనేక దుర్వాసనలు శ్రీహరిమహిమచే హరించును. ఒక్కమంచి వాసన యున్న యెడల దాని సహాయముచే మలిన వాసనలన్నియు హరించును. శ్రీహరినామములో యున్న మహిమ నీవు తెలిసినయడల నీసర్వము హరించును. నీసం దేహములు తీరును.

ప్ర : దయారస, అన్ని వాసనలు హరించవలెనని అంటిరి గదా ఇప్పుడు సువాసనచే దుర్వాసనలు హరించునంటిరి. సువాసన మాత్రము యుండవచ్చునా?

ఉ : వత్సా, పసిపిల్లవానికి చక్కెరసహాయముచే మందు పోయుదురు. పెద్దవానికి చక్కెర సహాయము అవసరము లేకనే మందు వేయుదురు. అట్లే సాధకుడు సువాసనసహాయముచే దుర్వాసనలను విడిచి తరువాత సువాసనలను కూడా పూర్తిగా విడువవలెను.

ప్ర : కరుణానిధీ, మీరుయెంత బోధించినను తృప్తికలుగుట లేదు. ఎందుచేతను ఎప్పటికైనా తృప్తికలుగునా?

ఉ : వత్సా, ఈ మహాకరువులలో యెంతధనము యున్నను తృప్తికలుగనట్లు ఈ కలియుగములో యెంతజ్ఞానము యున్నను జీవయాత్రకు తృప్తికలుగుటలేదు. తీవ్రముగా అభ్యాసము చేయవలెను.

ప్ర : తండ్రీ, తృప్తికలుగుటకు ఉపాయమేమి ? కలియుగ

ములో చేసిన సాధనాబలముచేత తీవ్రతర అభ్యాసముచేత జీవయాత్రకు ఆనందము కలుగునా?

ఉ: వత్సా, చెట్టునుండి పుష్పమును వేరుచేసి ఆత్మ సమూహమను రత్నములను గ్రహించి నిగ్రహించి రత్నమాలను గుచ్చి స్వీకరించినయెడల శ్రీహరికి శ్రీ మహావిష్ణువునకు సమర్పించినయెడల నీకు తృప్తికలుగును. అప్పుడు యెంతకరువు వచ్చినా ఎన్నిగాలివర్షములు వచ్చినా నీకేమి భయములేదు. నీ గూటిలో నీవు స్థిరముగా యుండవచ్చును. ఆనందముగా తృప్తిగా నీవు జీవయాత్ర పూర్తిచేసుకొని యెదటివారిని తృప్తిపరచగలవు. భయపడకుము సందేహములేదు.

ప్ర: తండ్రీ, గ్రహించి నిగ్రహించమని నీగూటిలో నీవు స్థిరముగా యుండమని శలవిచ్చితిరిగదా మీ అభిప్రాయమేమిటి?

ఉ: వత్సా, నిజతత్వమును (స్థిరాత్మను) గ్రహించి అది చెడిపోకుండా నిగ్రహించి జాగ్రత్తపరచవలెను. (తస్మాత్ జాగ్రత జాగ్రత) అనునట్లు నిజపదార్థమును స్థిరాత్మను నీవు జాగ్రత పరచవలెను. అదే (అగ్రాహ్య) మనబడును. నీగూటిలో నీవు అనగా (గుహాయాం విశ్వమూర్తిషు) అనునట్లు సర్వేశ్వరుడు సమస్తచరాచరములలో బుద్ధిగుహాయందు నివాసముగానుండెను. అందులో మానవశరీరములలో విశేషముగా విశదమగును. కనుక నీబుద్ధిగుహాయందున్న విశ్వమూర్తిని తెలిసి బాహ్యానాటకమును ఇంద్రజాలమును చాలించుము. బాహ్యానాటకములో తృప్తిలేదు. కనుక నీబుద్ధిగుహాలో నిజస్థానములో స్థిరముగా నిలువుము.

ప్ర: తండ్రీ, విశదమైనదికాని గ్రహించినది నిగ్రహించుట అంత కష్టమా?

ఉ: వత్సా, కుమారా, అవునుకష్టమే. రూపాయిసంపాదించవచ్చునుగాని అది చెడిపోకుండా దాచుట చాలకష్టముగదా.

ప్ర: తండ్రీ, ఎందుచేతకలిగినది దాచుటకష్టము దానివిలువ తెలియకనా కారణమేమి?

ఉ: వత్సా, నాయనా సహజ 24 తత్వముల తాలూకు తమస్సుచే కష్టము కలుగును. దానివిలువ తెలిసిన యడల జాగత్తగా భద్రపరచును.

ప్ర: తండ్రీ, సహజమైనప్పుడు నిగ్రహించుట యెట్లు? దయతో తెలవిండు.

ఉ: వత్సా, నాయనా, అందుకనే నీకు ఇన్నివిధములలుగా బోధించవలసివచ్చినది. నీవుయెలాగ పోయినాసరేఅని (జీవులు) యెలాగ పోయినాసరేఅని చూచిసహించలేక ఇంతగాబోధించుచున్నాను. నీకుకష్టముగా యున్ననుసరేఅని ఇప్పుడుకష్టముగా యున్నట్లుండును. ఆతరువాతనీకు బోధపడును గదాఅని అనేక విధములుగా బోధింపవలసి వచ్చినది. గురుబోధ అనగా యేమి అనుకొంటివి ఎంతకఠినముగా నుండునో తెలుసునా ఆబోధకి ఆగినవారే ధన్యులు. వినుము అంటూ మామిడిపండు యెంత విలువైనది. అయినను ఎంతబాగుగా పరిపక్వ దశకు వచ్చి పండిన పండు అయినను సహజముగు జీడి యెట్లుండునో ఆ మాదిరిగా యెంతజ్ఞానిఅయినను యెంత బ్రహ్మజ్ఞాని అయినను

సహజమగు విద్యతో గూడిన విషయములు బాధించుచునే యుండును.

ప్ర: తండ్రీ, మనసంగతి మొదటికి వచ్చినదే. అయితే వారిదారి యేమగును ?

ఉ: వత్సా, మామిడిపండు బాగుగా పరిపక్వదశకు వచ్చు సరికి. పులుపులంతా మాధుర్యముగా మారి రసముతో నిండి నప్పుడు. సహజజీడి అతి సూక్ష్మముగా యుండును. రసము నందుయున్న లక్ష్యముచేత సహజజీడిని సాధకుడు లక్ష్యము చేయుడు. జీడినిపిండివేసి రసము నేతీసుకొనును. ఆమాదిరి జీవుడు పరిపక్వదశ వచ్చునరికి సహజవిషయములలో నున్నను లక్ష్యము చేయక (విషయములోని విషమును) పిండి వేయును. విషయ మును ఖండించి అమృతరసమును గ్రోలుచునాయునా, తెలిసినదా?

ప్ర: తండ్రీ, అప్పుడు సహజమగు జీడి వానిని బాధించదా శరీరధర్మములచే చేయుక్రియలు యెట్లుబాధించ కుండును.

ఉ: వత్సా, నిజతత్త్వమునందు యున్నలక్ష్యము చేతను విషయమును విషప్రాయముగా తెలియుట చేతను తీవ్ర వైరా గ్యముచేతను బాధించకుండును.

ప్ర: తండ్రీ, నిష్కామముగా చేయుమని నిష్కామముగా యుండుమని శలవిచ్చితిరిగదా? కష్టపడి సంపాదించిన వస్తు వును విడుచుటయెట్లు కర్మచేసి ఫలితమును విడువమనిగదా శల విచ్చితిరి. అంత ప్రేమతో చేసినపనికి ఫలితము వచ్చినప్పుడు యెట్లువిడుచుట యెట్లువిడువవలెను.

ఉ: వత్సా, తుమ్మెద అన్ని పుష్పముల మీద నుండి

పుష్పముచెడకుండా నేర్పుగా మకరందమునుతీసి ఒక చోట కూడ బెట్టునుగదా. ఆ మకరందము లోకోపకారకము అగును. దానిని నిగురించి తుమ్మెదకు నేనుకూడబెట్టిన మకరందము పోయిన దని విచారము లేదుగదా అట్టి నిష్కామముగా సర్వేంద్రియ వ్యాపారము ప్రారబ్ధానుసారము జరుగుచున్నను కాని ఫలితము లగు సుఖదుఃఖములను విడిచి తద్ద్వారా అమృతరసమునే పొంది విషయఫలితమును పొందకుండవలెను.

ప్ర : తండ్రీ, అదియెట్లు? మీరు అంతచక్కగా నేర్పుగా శలవిచ్చెదరుగాని మీరుచెప్పిన అంశములలో ఒక్కటైనను నాకు అర్థము కాలేదు. యేమిచిత్రము. బ్రహ్మవిద్యఅనగా ఇంత శ్రమయున్నదా? ఆహా పరమేశ్వరా! రక్షింపుము. ఈ దీనుని దయచూడుము.

ఉ : వత్సా, అంత దస్సిపోయెదవేల! అడుగడుగున అంత అధైర్యపడెదవేల నేనుచెప్పినదంతయు నిష్ఫలమేనా, ధైర్యము వహించుము. 2 జాములైనది యేదోఇంతప్రసాదముభుజింపుము.

ప్ర : తండ్రీ, ఇంతమర్మము పెట్టెదరేల ప్రసాదమనగానేమి దయతో శలవిండు.

ఉ : వత్సా, తత్వమునీకు పూర్తిగా బోధపడకపోవుట చేత మర్మము పెట్టినట్లు నీవుతలచెదవుగాని నీవద్దనేను యెంత మాత్రము మర్మము పెట్టలేదు సుమా. జీవితములో సగము కాలము గడచినది. ఇంతవరకూ జీవితమువృధాఅయినదిగదా కనుక ఇకనైనను లేచి మేలుకొని యేదోమార్గముగా నీకుతోచి నట్లు పరమాత్మను తెలిపి ఈశ్వరప్రసన్నముఅను మహా ప్రసాద

మును భుజింపుము. కాలము వృథాపోనివ్వకుము. నెమ్మదిగా సాధించుము. తుమ్మెదనుగురించి నీకు తెలియులేదనిగదా నీ అభిప్రాయము. తుమ్మెద పుష్పముమీాదనుంచి మకరందముతీయునట్లు జ్ఞానేంద్రియ అంతఃకరణ చతుష్టయములను ఇంద్రియములద్వారా విషయసుఖమును ఖండించి జ్ఞానామృతమును గ్రోలుము అది సర్వేశ్వరునిలో కలియునుగాని దానిఫలితముచే నీవు బద్ధుడవు కాజాలవు.

ప్ర : తండ్రీ, వాసనాబలము యెక్కువగా యున్నప్పుడు యెట్లు సాధింపవలెను. ఈశ్వర ప్రసన్నము యెట్లు కలుగును.

ఉ : వత్సా, కట్టెలలో అగ్ని నిబిడీవృతమై యుండునట్లు 24 తత్వములలో జ్ఞానాగ్ని అను పరమాత్మ గలదు. ఆ కట్టెలలో నుంచి అగ్ని ప్రజ్వలింప జేయునట్లు త్రిగుణాత్మకమైన ఈశరీరము లోనుంచి జ్ఞానాగ్నియను స్థిరపదార్థమును స్థిరాత్మను వెలువరించ వలెను.

ప్ర : తండ్రీ, అగ్నిని పొగకప్పియుండునట్లు అజ్ఞానాంధకారముచే ఆత్మకప్పబడియుండునుగదా. యెట్లు వెలువరించవలెను ?

ఉ : వత్సా, యెండుకట్టెలమీాద ఒక్క అగ్నికణము వేసిన పొగ యెక్కువగా లేక జ్వాలలు వచ్చినట్లు నీ అంతఃకరణ శుద్ధి యున్నయెడల గురుమంత్రమనే గురు లక్ష్యము నీ అంతఃకరణకి పట్టినేని నీఅభీష్టము నెరవేరును. స్థిరాత్మను పొందగలవు.

ప్ర : తండ్రీ, ఎండు కట్టెలైనచో పొగయుండదా సుళువుగా అగ్ని జ్వాలలు ప్రజ్వలించునా, పచ్చికట్టెలైనచో నేమి చేయవలయును?

ఉ: వత్సా, యెండుకట్టెలైనను, పొగసహజము. అగ్ని తీవ్రముగా, జ్వాలలువచ్చుటచేత పొగఅణగిపోవును. అట్లే అజ్ఞానాంధకారమను పొగను తీవ్రవైరాగ్యముచేత ఊర్ధ్వమూలముగా, ఊదినట్లు ఊర్ధ్వరేతస్కుడవైన యెడల (ఊర్ధ్వరేతం విరూపాక్షం) అనునట్లు అజ్ఞానాంధకారమను పొగపోయి, అగ్నిజ్వాలలవలె పూర్వజ్ఞానముకలుగును. విశ్వరూపుని మహిమ తెలియగలవు. అదేమహాప్రసాదము. ఎండు కట్టెలైనచో నీకుప్రయాసలేకనే అగ్నిజ్వాలలు వచ్చినట్లు నీ అంతఃకరణశుద్ధి యున్నయెడల ప్రయాసలేకనే మహాప్రసాదము లభ్యమగును. పచ్చికట్టెలైనచో శ్రమపడి అగ్నిని ప్రజ్వలింపచేయునట్లు నీవుకొంత అభ్యాసయోగముచేత, సాధించవలెనుగాని విసుగుచెంది విడువకూడదు సుమా.

ప్ర: తండ్రీ, నిశ్చలతత్త్వము, నిర్మలతత్త్వము యెట్లుండును? ఎట్లు తెలియగలను? దయతో శలవిండు, పూర్ణకటాక్షముచే ఆజ్ఞాపింపుడు.

ఉ: వత్సా, ఘడియారమున్నస్థలములో విశ్రమించిన ఘడియారము టక్కు టక్కు మని కొట్టుకొనుచుండగా అచ్చటి వారికి శాన్తి నిశ్చలత్వము లేక నిద్రపట్టక యెంతబాధగా యుండునో ఆమాదిరిగా నేను జీవిని నేను సంసారిని అని హృదయములో విపరీతభావనలతో టక్కు టక్కు మని అహంభావనతో గూడిన చలనము తాపము యున్నంతకాలము నిశ్చలతత్త్వము యోగనిద్రయుండదు. మరి యెట్లనగా, వాచీ లేని స్థలమున కేగినయెడల టక్కుటక్కు మని కొట్టకుండా

నిశ్చలముగా యెట్లుండునో అట్లే నేను జీవిని నేనుసంసారిని అని టక్కుటక్కు మని కొట్టుకొనుస్థలమునుంచి తాను వేరై వేరుస్థలమున కేగినయెడల నిశ్చలముగా నిర్మలముగా యుండును.

ప్ర: తండ్రీ, వాచీని వేరుపరచినట్లు తానుయెట్లు వేరు అగును. వాచీతో పనియున్నట్లు తనకు హృదయముతోను పనియున్నదిగదా, నిశ్చలత్త్వము యెట్లుకలుగును? దయతో శెలవియ్యవలెను.

ఉ: వత్సా, వాచీతో పనియున్నంతవరకే నీకు దాని సంబంధము యుండును. దానిపని నీకుతీరినతరువాత అదివేరు. నీవు వేరేగదా. ఆమాదిరిగా సంకల్ప వికల్పములతో నీకు కొంతవరకే పనియుండును. ఆతరువాత సంకల్ప వికల్పములు వేరు. నీవు వేరేగదా. అదినీవు బాగుగా గుర్తుతెలుసు కొనుము.

ప్ర: దీనదయాపర, వాచీతోను మనసుతోనుకూడా సంబంధము యున్నప్పుడుకూడా తాను వేరుగా నుండెనేమో అని తలుస్తాను. మీఅభిప్రాయమేమి?

ఉ: వత్సా, అదేనిజస్థితి. త్రికాలములయందు తాను వేరని తెలియుట ముఖ్యాభిప్రాయము. అదేనిగ్రహించవలెను. మాటలచే చెప్పుటకాదు. త్రికాలములయందు యెట్టి విషయములు వచ్చినా తాను వాచీతో మనసుతో కలియకూడదుసుమా.

ప్ర: తండ్రీ, వాచీతో పనియెట్లు లేకపోవును. జీవికి మనసుతో పనియెట్లు లేకపోవును. వాటితోతాను యెట్లు వేరగును?

ఉ: పుత్రా, వాచీతో అవసరము యున్నప్పుడు దేశకాలములను అనుసరించి టైముకావలెనన్న వాచీకి తాను (కీ) ఇచ్చును. ఆ (కీ) యున్నంతకాలము ఆవాచీ పనిచేయును. ఆ కీ) అయిపోగానే వాచీనిలచిపోవును. అప్పుడు దేశకాల నియమములతోగూడిన టైము తెలియదు. ఆమాదిరిగా నీవు మనసునకు (కీ) ఇచ్చిన అది సంకల్ప వికల్పములతో నేను నీవు అని (సోహం సోహం) అని అహంకార మమకారములతో పనిచేయును. అదినీకు వాచీముల్లువలె ఋర్రలో (మెదడు) లో టక్కు టక్కుమని పనిచేయుచుండును. అప్పుడు నీకు విశ్రాంతి నిశ్చలతత్వము నిర్మలతత్వము యుండదు. నీవు నీవిశ్రాంతి కొరకు మనస్సుకి (కీ) ఇవ్వకుండాయుంటే వాచీఆగిపోయినట్లు నీమనస్సు ఆగిపోవును. అప్పుడు నిశ్చలతత్వము నిర్మలతత్వము కలుగును. అప్పుడు దేశకాలనియమములతోను టైముతోను నీకు సంబంధములేదు. వాచీతిరిగినట్లు నీమనస్సు విషయములతోగూడి తిరిగిన నీకు నిర్మలత్వములేదు. వాచీ ఆగిపోయినట్లు నీమనస్సు ఆగిపోయిన, నీకు నిశ్చలతత్వము నిర్మలతత్వము కలుగును. అప్పుడు వాచీ వేరు. (కీ) వేరుగాను తెలియును.

ప్ర: తండ్రీ, వాచీఆగిపోతే సాధకునికి బాధలేదుగాని మనస్సుఆగిపోతే దేశకాలనియమములు సాధకునికి యెట్లు తెలియును?

ఉ: వత్సా, నిర్మలహృదయము నిశ్చలతత్వము అయినప్పుడు వాచీవేరు తానువేరుఅని తెలిసినట్లు అంతఃకరణ

చతుష్టయము 24 తత్త్వములు వేరు. తాను వేరు అని తెలిసి నప్పుడు దేశకాలనీమములతో తనకు పనిలేదు. నిర్మలతత్త్వము నిశ్చలతత్త్వముఅయి పరమశాన్తిని పొందును.

ప్ర: తండ్రీ, దీనదయాపర, నీదయవల్ల ధన్యత్వము కలిగి నది. శరీరము అంతయు శీతలమైనది. ఏమిఅడుగుటకు తోచుటలేదు. వాక్కు వచ్చుటలేదు. వాగింద్రియము ఆగిపోయినది. ఈశాన్తి ఈనిశ్చలతత్త్వము నిజమైనది అగునా కాదా. పురాణవైరాగ్యమువలె ఇప్పటికి శాన్తికలిగినదా. మీాఅభిప్రాయమేమి?

ఉ: వత్సా, బాగుగాఅడిగితివిగదా నిజమే. పురాణ వైరాగ్యమువలె ఇప్పటిశాన్తియే అయియుండునుగాని సహజ శాన్తికాదని తలచెదను. నిజశాన్తి కలుగవలెను.

ప్ర: తండ్రీ, సర్వేశ్వరా, నేను అనుకున్నంతపని అయినది. మీారు అలాగ అనెదరని నేను అనుకొనుచునేయున్నాను. అయిన సహజశాన్తి యెట్లుకలుగును. ఎట్లు తెలియగలను. నాసందేహమును తీర్చుడు.

ఉ: వత్సా, ఒకసారి మీారుచెప్పినది నాకు అర్థమగుటలేదు. మీారు చెప్పెదరుగాని నాకు తెలియదు. నాకు గాభరాగా యున్నది. బ్రహ్మవిద్య అనగా ఇంతకష్టముగా యుండునా. అని అధైర్యపడుట దిగజారిపోవుట ఒకసారి బ్రహ్మతత్త్వము తెలిసినదని, శాన్తిగా యున్నదని శీతలముగా యున్నదని ఉప్పొంగిపోవుట గర్వించుట ఈ 2 గుణములు జీవలక్షణములే సుమా. ఈ 2 లక్షణములతో నీవుకూడియున్నంతకాలము నీకు

పూర్ణశాన్తికలుగదు కనుక నష్టమువచ్చినను సుఖమువచ్చినను 2 అవస్థలయందు ఏకమనస్సుగా యున్న వాచీకి (కీ) ఆగిపోయి నట్లు తెలియును. అదే పూర్ణశాన్తి నిశ్చలతత్త్వము నిర్మల తత్త్వము.

ప్ర : స్వామి, పరానందా, ఇంద్రియనియమములు యెట్లుండ వలెను, మీయొక్క ముఖ్యాభిప్రాయమేమి ?

ఉ : వత్సా, సర్వేంద్రియవ్యాపారము యొక్క ఉపశమనమే దానిముఖ్యాభిప్రాయము. అందులో వాగింద్రియము సాధకునికి ముముక్షువుకి పరమశత్రువు కనుక వ్యర్థసంభాషణము కూడదు. అతిప్రసంగముపనికిరాదు. సాధ్యమైనంతవరకు మౌనమేముఖ్య వ్రతముగా తెలియుము. అందులో వాగింద్రియము ముముక్షువుకి సాధకునికి నిత్యశత్రువు కనుక సాధ్యమైనంతవరకు మౌనము ముఖ్యము అతిప్రసంగము అనేకఅనర్థములకు ముఖ్యకారణము. మహనీయులుకూడా అనరానిమాటలు యెదుటివారిని అని యెదటిజీవిని నిష్కారణముగా దుర్భాషలాడి బాధపడిపోవు చున్నారుగదా కాబట్టి వాగింద్రియమును ఒకమూల పెట్టవలసి నదే! అన్నిదానములలోకి నిదానమేగదా ముఖ్యముగా గమ నించవలసిన విషయము. ఎదటిజీవిని నిష్కారణముగా ఏవిధము చేతను బాధించరాదు.

ప్ర : తండ్రీ, అంతమౌనముగా యుంటే వ్యవహారము యెట్లు సాగును ?

ఉ : వత్సా, వాచీకి (కీ) సరిగాలేనప్పుడు తర్చుగా ముల్లు యెట్లుఆగిపోవునో అదేప్రకారము మనస్సునకు సంకల్ప వికల్ప

ములులేనప్పుడు వాక్కు ఆగిపోవునుగదా దానికొరకు నీవు దృఢ చిత్తుడవుకమ్ము వాచీచెడిపోయినప్పుడు ఎంత (కీ) ఇచ్చినను తిరుగనట్లు మనస్సు విషయములలోనుంచి పైకిదాటి విముఖత చెందినయెడల వాక్కు నిలచిపోవును. అప్పుడు జగద్వ్యాపారము గాని దేహేంద్రియవ్యాపారముగాని జరిగినను జరుగకపోయినను విచారములేదు. వ్యాపారముతో సంబంధములేదు. తానువేరు వ్యాపారము వేరుగా తెలియును.

ప్ర : దయారస, జ్ఞానత్రయములో నుంచి సాధకుడు యెట్లు విడివడును, ఎప్పుడు వీడును ?

ఉ : వత్సా, వృక్షమునుంచి పండు పరిపక్వదశకు వచ్చు సరికి తొడిమెనుంచి పండు విడవడిరాలినట్లు జీవికి సాధకునకు పరిపక్వదశ వచ్చుసరికి శరీరవృక్షమునుంచి కారణశరీరమను తొడిమనుంచి విడివడి శరీరమునుంచి చింతగుల్లవలె వేరగును. విదేహుడగును.

ప్ర : పరానంద, మౌనము వహించినంత మాత్రముచే పూర్ణశాన్తి కలుగునా, పైకిమాత్రము శాన్తిగా యుండునా ?

ఉ : వత్సా, మౌనము మూడువిధములుగా చెప్పబడును. (1) బాహ్యమౌనము (2) ఆంతర్యమౌనము (3) నిర్వాసనా మౌనము అని చెప్పబడును.

ప్ర : తండ్రీ, ఇందులోయేది ముఖ్యము ? దేనిస్వభావము యెట్లుండును ?

ఉ : వత్సా, నిర్వాసనామౌనమే ముఖ్యము. దానిస్వభావ మేమనగా. అరటిచెట్టు గెలవేయుసరికి ఆకులు తిరిగి పుట్టనట్లు

నీఅంతఃకరణలో వాసనలన్నీ నిర్వాసనఅయేసరికి పూర్ణశాన్తి కలుగును. వాసనలు మళ్లీపుట్టవు.

ప్ర : తండ్రీ, పైనవివరించిన 2 మానములవల్ల శాన్తిలేక యెట్లుండును?

ఉ : వత్సా, వినుము. (1) పిల్లలు వీధిలోనికిపోయి పిల్లలతోగూడి అల్లరిచేయుచున్నప్పుడు లోపల తల్లి దండ్రులయందుగాని తల్లి దండ్రులుచెప్పిన నీతులయందుగాని లక్ష్యము లేక లోకవాసనలతోగూడి యుందురు. అప్పుడు తల్లిదండ్రులు ఆ పిల్లలను లోపలకి తీసుకువచ్చి బెల్లము ముక్కగాని, చక్కెరగాని ఇచ్చి కొంతశాన్తి పరచి వీధితలుపులు మూసివేయుదురు. అట్లే బాహ్యేంద్రియముల తాలూకువాసనలను బాహ్యవాసనలను నిగ్రహించుటకొరకు బాహ్యవాసనలలో సుఖము లేదని తెలిసి చక్కెర అను భగవన్నామము చేసిన కొంతశాన్తి పొందును అదే బాహ్యమానము.

ప్ర : తండ్రీ, అయితే పిల్లలను లోపలవుంచి, బెల్లము ముక్కపెట్టి వీధితలుపులు వేసినయెడల పిల్లలు అల్లరిలేక యుండిరా, ఆమాదిరిగా పైకి మానము వహించినంతమాత్రముచే లోపల అల్లరిలేక వాసనలులేక యుండునా?

ఉ : వత్సా, ఎట్లుండును. స్థూలశరీరమునకు విపరీతజ్వరము వచ్చి బాధపడుచుండగా కొయినాఇచ్చి, స్థూలజ్వరమును కట్టించినప్పుడు ఆజ్వరమువలన సూక్ష్మశరీరములో యెంత బాధగాయుండునో, యెంతకంగారుగాయుండునో అప్రకారము పైకి మానము వహించినను లోలోపల చెదపురుగులవలె మన

సులో సూక్ష్మవాసనను గొలుకుచుండునుగదా, వేరుకిపట్టి విషపురుగువలె కంగారు మరియు బాధగాయుండును.

ప్ర: తండ్రీ, సూక్ష్మమానమువల్ల శాన్తి కలుగునా, ఏమి సాధనముచేసినచో! లోపలకంగారు తగ్గును, లోపలయున్న పిల్లల అల్లరి యెట్లుతగ్గును ?

ఉ: వత్సా, (2) వినుము తల్లి తండ్రులు బాహ్యాల్లరి కొంతతగ్గి శాన్తించిన పిల్లలనుచూచి దయగలిగి పిల్లలను లోపలకి తీసుకుపోయి పెరుగుఅన్నము గాని, క్షీరాన్నమును గాని పెట్టి మరికొంత శాన్తిపరచెదరు. ఆమాదిరిగా భక్తితో గూడిన భగవన్నామముగాని, భగధ్ధ్యానముగాని చేసినయెడల భక్తిశ్రద్ధలతో తదేకధ్యానము చేసినయెడల లోపల కంగారు కొంతతగ్గి శాన్తికలుగును. నీవుభక్తితో భగవన్నామము చేయునప్పుడు పరమేశ్వరునిలోనుండి (పవిత్ర హృదయములో నుండి) ఒకవిధమైన భక్తిరసము ఆనందము కలుగును. అది నీవు తెలిసితివేని పెరుగుఅన్నము భుజించిన పిల్లలు శాంతించు నట్లు నీ ఆంతర్యవాసనలు ఇంకాశాన్తిచెందును. అదే ఆంతర్య మానము. అది ఆరహస్యము అనుభవజ్ఞులకే తెలియునుగాని ఇతరులకు తెలియదు. మాటలుచెప్పవచ్చునుగాని, నిగ్రహించుట చాలకష్టము.

ప్ర: తండ్రీ, పిల్లలు క్షీరాన్నమును భుజించుటనగా నేమి, భక్తిరసము భుజించిన తరువాత యేమిజరుగును.

ఉ: వత్సా, (3) ఆభక్తిరసముచే స్థిరజ్ఞానము కలుగును. ఎట్లు క్షీరాన్నము మొదలైన మధురపదార్థములు భుజించిన

పిల్లలు అల్లరిలేక శాన్తిగా, నిదురించెదరో, అప్రకారము భక్తిరసముచేత, అతీతభక్తి దానిచే పూర్ణశాన్తి కలిగి ఆమధుర రసముచే యోగనిద్ర చెందును. అప్పుడు యేవాసనలు నుండవు. అదే నిర్వాసనావస్థానము. ఆ స్థితిచెందిన పూర్ణశాన్తి కలుగును. కారణబీజములను సర్వవాసనలు హరించును. త్రివిధస్థానములను గ్రహించితివా, తెలుసుకుంటివా!

ప్ర: తండ్రీ, తెలుసుకొంటిని. గ్రహించితిని. భగవన్నామము భక్తిరసముతోగూడిచేసినందున ఇంక మహిమయున్నదని తెలుసుకొంటిని. గ్రహించితిని. పూర్ణశాన్తి క్రమముగా కలుగునని తెలిసినది. శాన్తినిలయా (బ్రహ్మసత్యం జగన్మిథ్య) అని పెద్దలు శెలవిచ్చెదరుగదా ఈ కనబడుచున్న పరిదృశ్యమానమైన సర్వజగత్తుసంగతి ఏమిటి, ఎట్లు వచ్చినది, ఎట్లు లేకపోవును?

ఉ: వత్సా, సూర్యచంద్రులు, ఎలక్ట్రీదీపము మొదలైన జ్యోతి వెలుగునపుడు ఆజ్యోతితాలూకు కిరణములు యెట్లుండునో ఆకిరణములు అనేకరంగులతో గూడియున్నను ఆకిరణములు ఆసంచరంగులు జ్యోతికన్న వేరుకావుగదా, జ్యోతియందునీకు దృష్టియున్నప్పుడు కిరణసమూహమునకు గోచరముకాదు. అట్లే అఖండజ్యోతిలో సాధకునిదృష్టి యెక్కువగాయున్నప్పుడు వేరుపదార్థము ఆత్మేతరపదార్థము గోచరముకాదు.

ప్ర: తండ్రీ, బ్రహ్మజ్ఞానము ఎక్కడయుండును. ఎట్లు సంపాదించవలెను. సాధకుడు ఏయుపాయముచేత గ్రహించగలడు?

ఉ: వత్సా, బ్రాహ్మణుని ముఖమునందు అనగా బ్రహ్మజ్ఞాని ముఖమునందు షోడశకళాపూర్ణుడై స్వప్రకాశముగా పరంజ్యోతి దివ్యతేజస్సుగా వెలుగుచుండును. చీకటిలోనుండు వస్తువును దీనిసహాయముచే పరిశోధించినట్లు షోడశకళాపూర్ణుడైన ఆపరంజ్యోతిద్వారా అనగా బ్రహ్మజ్ఞానియొక్క నామ రూపములను సర్వతత్వములను విడిచి భాగత్యాగముచే పూర్ణకళను గ్రహించి తద్ద్వారా సాధకుడు అజ్ఞానాంధకారమునుండి స్థిరాత్మను వెలువరించి బయలుపరచి ధన్యత్వము పొందును.

ప్ర: తండ్రీ, మీవాక్యమందు నమ్మకమేమి బ్రహ్మజ్ఞాని ముఖమునందు షోడశకళాపూర్ణుడైన పరంజ్యోతి పూర్ణకళ యున్నదని దృష్టాంతమేమి?

ఉ: వత్సా, అప్పటికి గురువాక్యమేగదా గొప్పనమ్మకము కనుక గురువాక్యమునందు నమ్మకముండవలెను. దృష్టాంతమేమనగా (బ్రాహ్మణోఽస్యముఖమాసీత్) అనునట్లు బ్రహ్మముఖముద్వారా వెలువడినవారు బ్రాహ్మణులేగదా. అందులో బ్రహ్మలక్షణములుకూడా యుండినయెడల ఇంక లోపమేముండును. వేరేచెప్పవలయునా! ఉప్పుగడ్డ మహా సముద్రములో కలసినట్లే వాడు వాడే (బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి) అనునట్లు తెలియుము.

ప్ర: తండ్రీ, భాగత్యాగమనగానేమి. యెట్లు భాగింపవలెను?

ఉ: వత్సా, ఆకాశమున చుక్కలు చంద్రుడు కలసి యున్నను చుక్కలను విడచి చంద్రుని చూచునట్లు విభాగించుము. పౌర్ణమిరోజున పూర్ణచంద్రుడు సంపూర్ణచంద్రుడు

ప్రకాశించునప్పుడు చూచువారికి చంద్రదర్శనమువల్లను శాన్తి శీతలమువల్లను ఒకవిధమైన తృప్తికలిగి చంద్రునిమీద నే దృష్టినిలచిపోవునుగాని చుక్కలు గోచరములుకావుగదా. అట్లే దేహేంద్రియములలోనున్నా పూర్ణచంద్రుని ఇంద్రియములచే వేరుపరచి పూర్ణతత్వమును తెలియుటే భాగత్యాగ మనబడును. కనుక (నేతినేతి) మహావాక్యములచే 24 తత్వములను విశదపరచి పరిశోధించి నిజపదార్థమును స్థిరపదార్థమును తెలియును.

ప్ర: దీనదయాపర, బ్రహ్మజ్ఞాని జీవన్ముక్తుడు అయినందున ప్రయోజనమేమి. తాను ముక్తినిపొందుటేనా లోకమును గూడ ఉద్ధరించగలడా?

ఉ: వత్సా, జీవన్ముక్తుడుచేయు సర్వవ్యవహారములు లోకోపకారమునకేగాని స్వలాభమునకు ఎంతమాత్రము కాదు. లోకమును ఉద్ధరించగలడు.

ప్ర: తండ్రీ, ఎట్లు స్వలాభముండదు. దేహేంద్రియములచేచేయు సర్వవ్యవహారములు నేను నాది అనేగదా చేయును. నేను నాదిఅని చేయునప్పుడు లోకోపకారము యెట్లగును?

ఉ: వత్సా, నేను నాది అను భేదభావనలేక సర్వము బ్రహ్మము బ్రహ్మకర్మమునే బ్రహ్మాకారముగానే చేయునుగాని నేను నాదిఅనిచేయుడు, సర్వము బ్రహ్మాకారముగానే చేయును.

ప్ర: తండ్రీ, వానిని గుర్తించుటయెట్లు, వానిమహిమలు యెట్లుండును?

ఉ: వత్సా, బ్రహ్మజ్ఞానిని తెలియుటకు అంతటివాడే

కావలయును. అన్యులకు తెలియ తరముకాదు. అయినను కొంత వివరించెదను వినుము: వానియొక్క నడవడినిబట్టి వానిగుణము లనుబట్టి వాని లక్షణములనుబట్టి (గుణకర్మ విభాగశః) అను నట్లు తెలియవలెను. కొంతవరకు వానిఆచరణమునుబట్టి బుద్ధి మంతులుగ్రహించగలరు. వానిమహిమలు యెట్లుండుననగా ఒక వనములో ఒక్క మంచిగంధపు వృక్షము యున్న యెడల వనమునకంతకు యెట్లు పవిత్రమైన సువాసనకలుగునో అట్లే బ్రహ్మవిదుడున్న ప్రదేశములలో పవిత్రముగా మంచిసుగుణ ములు వెదజల్లుచుండును. నిర్మలముగా నుండును. సంసార దావాగ్ని చల్లారును. ఒక్కవంశములో ఒక్కసుగుణసంపన్నుడు యున్న యెడల వానివంశము ఒక్కటేకాక అనేకవంశములు తరించునుగదా. అట్లేబ్రహ్మజ్ఞానియున్న వంశములు యెన్నియో పవిత్రములగును. ఆమహిమలుచెప్పతరముకాదు. మేఘములో మెరుములవలె అనేకమహిమలు కలుగుచుండును అదే లోకో ద్ధారణఅనబడునుగదా! ఆమహిమలు అన్యులకు తెలియుతరము కాదు. రామకృష్ణ మొదలైన అవతారపురుషుల మహిమలు మేఘములలో మెరుమలవలె అతి ఆశ్చర్యముగా యుండును గదా! అట్లే తెలియుము. ఈపూర్ణదశా స్థినిపొందిననాడే ఈశరీర మను దేవాలయము లో ఈశ్వరప్రతిష్టకలుగును. ఎన్నిజన్మముల కైనను సాధకుడీ నిజస్థితికిరావలెను. అప్పుడే జీవన్ముక్తి నిర్వి కల్పత్వము కలుగును. (పూర్ణమదః పూర్ణ మిదం) అనునట్లు తెలియుము.

ప్ర : తండ్రీ, అప్పుడు బ్రహ్మజ్ఞానివేరు సర్వేశ్వరుడు వేరు

కాదా! ఒక్కటి యెట్లగును (బ్రహ్మసత్యం జగన్మిథ్య) అను విషయమును యెట్లునమ్మగలను. దేహేంద్రియవ్యాపారముతో కనపడుచున్నాడు గదా!

ఉ: వత్సా, జ్యోతి వెలుగునప్పుడు నీవు ఆజ్యోతికిదూరము అయినకొలదీ జ్యోతితాలూకుకిరణములు అనేకరంగులతో నీకు కనబడును. జ్యోతి వేరు కిరణముల రంగులు వేరుగా నీకు కనపడ, నీవు కొంతధైర్యముపూని జ్యోతిని దరిచేరినప్పుడు వెన్న ముద్దవలె ఏకజ్యోతియే నీకు గోచరమగునుగాని పంచరంగులతో గూడిన కిరణములు నీకుగోచరములు కావుగదా! అట్లే అఖండ జ్యోతిని పరంజ్యోతిని నీవుధైర్యముగా దరిచేరితి వేని నీవుయేకా కారముగా ఒక్కస్థిరాత్మనే తెలియగలవు. అప్పుడునీకు అన్యము ఏమియునుండదు. అట్లుకాక అఖండజ్యోతిని నీవువేరుగా దూర ముగా చూచుకొలది అనేకనామరూపములు నీకు గోచర మగును, నీవు వేరు సర్వేశ్వరుడు వేరు అగును. అప్పుడు కర్మబద్ధుడవు అగుదువు.

ప్ర: తండ్రీ, వెన్నముద్దవలె అఖండాకారముగా తెలియు నప్పుడు వాడుఅన్యుడుకాడా వానికి నామరూపములు గోచర ములుకావా?

ఉ: వత్సా, వాడు అన్యుడుకాడు. వానిదృష్టికి ఇతరము ఏదీగోచరముకాదు. ఎట్లనగా దేవాలయములోనికి వెళ్లువారు పైప్రాకారములను నానురూపములను బొమ్మలను తొలగించి క్రమముగా గర్భగుడిలోచేరినపుడు పైవికారములను మరచి పోవుదురుగదా! (వాచారంభణంవికారో నామధేయం మృత్తి

కేత్యేవసత్యం) అనునట్లు తెలియును. తిరిగి పైకివచ్చినను నిర్మలత్వముతోను శాన్తితోను వచ్చునుగాని పూర్వపుఆతురత భ్రాంతి యుండదుగదా! అట్లే దేహత్రయముతాలుకు నామ రూపములను ఖండించి సాక్షాత్కారము అపరోక్షజ్ఞానము కలిగినతరువాత నిత్యతృప్తిగాను (బ్రహ్మాత్మాభేదముగాను) నుండునుగాని ఇతరము ఏమీగోచరముకాదు.

ప్ర: తండ్రీ, దేవాలయములోనికి వెళ్లినవారు తిరిగి పైకి వచ్చినపుడు అక్కడవిషయములతో సంబంధముండదా. వాని దృష్టి బొమ్మలమీద యుండదా?

ఉ: వత్సా, వానిదృష్టి విషయములమీద బొమ్మలమీద యుండదు. సర్వేశ్వరుని మీదనే యుండును. దేవాలయము లోనికి వెళ్లినపు డున్నదృష్టి తిరిగివచ్చినప్పుడు ఉండదు. నామ రూపములను మిథ్యగాచూచును.

ప్ర: తండ్రీ, నామరూపములను యెట్లు ఖండించును. దయ చూపవలెను.

ఉ: వత్సా (సర్వం ఖల్విదం బ్రహ్మ) అను శృతిచేత ఖండించును. సర్వము కల్పితమేగదా. కల్పితపదార్థములు యెట్లు నిజమగును. త్రికాలములయందు ఒక్కసత్యపదార్థమును నీవు న్మ్మినయెడల కల్పితము ఏదీనీకు గోచరముకాదు. గోచరించి నప్పటికిని, స్థిరముకాదు. నీకుఅంటదు. ఏసత్యవస్తువుచేత సృష్టిఅయినదో అది తెలియును. సృష్టిమూలము తెలిసిన యెడల సృష్టితోనీకు పనిలేదు. మహారాజు దర్శనమైనయెడల రాజభటులతో పనిలేదుగదా.

ప్ర: దీనదయాపర, అట్లైనయెడల ఏకీలేనియెడల బ్రహ్మే తరపదార్థము లేనియెడల ఒక్కసత్యవస్తువును నమ్మియుండక ఉపాసించక అనేకగ్రంథములు అనేకశాస్త్రములు మతములు అనేకఉపాసనలు యెందుకు. ఒక్కసత్యపదార్థమునునమ్మి స్థిరముగాయుండరాదా. ఈగందరగోళము యెందుకు. ఉంటే ఉండుగాక. అన్నిఉపాసనలు యెందుకు?

ఉ: వత్సా, అట్లకూడదు. ఎప్పుడునీకు ఒక్క సత్యమని తెలిసినది. ఆఖరుస్థితిలోగదా, నీవు ఎన్ని తిరిగిన ఎన్నిసంశయములు ఖండించితివి. అందరికి ఆనేర్పయయేనా లేనివారు చెడిపోవుదురుగదా. ఒక్కఅన్నముండి ఇతరపదార్థములు లేనియెడల నీవు ఒక్కఅన్నమును భుజించలేవుగదా, ఒకవేళనీవు భుజించగలిగినప్పటికి ఇతరులు నీవలెనే యుందురని అనకూడదుగదా. అన్నమురాశికి ఇతరపదార్థములు అలంకారములని అహంకారములని తెలియుము. అట్లే నీవు పూర్ణస్థితికి వచ్చువరకు ఈ అలంకారములన్నియు నుండవలెను. అలంకారములన్నియు నీకు సహకారులని తెలియుము. నీవు నిజస్థితికి వచ్చినప్పుడు సర్వము నీలోలీనమగును. ఎట్లన అన్నముతోసహా సర్వపదార్థములు నీలోలీనమగునుగదా అజ్ఞానులను ఉద్ధరించుటకొరకు అలంకారములన్నియు నుండవలయును. లేనియెడల వారుచెడిపోవుదురు. కనుక ఎప్పుడును అట్లు అనకూడదు. నీకు పనితీరిపోయిన సరియేనా? ఈ జగత్తున్నంత కాలము ఈబ్రహ్మాలంకారము లన్నియు యుండకతప్పదు. ఉన్నను బ్రహ్మవిదునకు ఏదీఅంటదు. ఏదీలక్ష్యముచేయుడు.

ప్ర: తండ్రీ, అజ్ఞానాంధకారములో యున్నవారు బయటికి యెట్లురాగలరు, తెలవిండు ?

ఉ: వత్సా, సత్పురుషులు బ్రహ్మనిష్ఠులు చేసేపని అదే గదా! అట్టివారిని పైకితీసి దారిచూపి లోకాన్ని ఉద్ధరించడమేగదా వారిపని.

ప్ర: తండ్రీ, అజ్ఞానాంధకారములో యున్నవారికి దారి యెట్లు చూపుదురు ?

ఉ: వత్సా, త్రోవను ఇద్దరు బాటసార్లు వెళ్లుచున్నారు. ఒకరిచేతిలో దీపము ఉన్నది. రెండవవానికి దీపము లేదు. మొదటివాని దీపసహాయముచేత దీపములేనివాడు దారినిపోవుచున్నాడుగదా, దీపముకావలెనని అడిగినా అడుగకపోయినా ఆదీపము వీనికియెట్లుగనునమునకుసహాకారిఅయినదో అట్లుజ్ఞాని అజ్ఞాని కలసి సంచారము చేయునప్పుడు జ్ఞాని తాలూకు జ్యోతి సహాయముచేత అజ్ఞాని గమనము చేయగలడు. వ్యష్టిదీపమే పనిచేయునప్పుడు జ్ఞాని తాలూకు సమష్టిదీపము పనిచేయుటలో ఆశ్చర్యమేమున్నది. అదే బ్రహ్మవిదుని మహిమలు అనుజ్ఞానసగోచరములని చెప్పితినిగదా.

ప్ర: తండ్రీ, సమష్టిదీపము యెట్లుండును? దాని ప్రయోజనమేమి? దానికి యజమానులుయెవరు ?

ఉ: వత్సా, వీధులలో వెలుగుపెద్దలైట్లు సమష్టి దీపములే గదా, మార్గస్థులందరకు సుకరముగా యుండుటకొరకు ప్రజల యుపయోగము కొరకు సమష్టి పెద్దలైట్లు గ్రామాధికారులు వేసిరి. అట్లేసర్వాధికారులు మహానుభావులు మహాజ్ఞానులు

లోకోద్ధరణకొరకు సమష్టిమార్గజ్యోతిని వేయుదురు. ఆవైటు సహాయముచేత అనేకప్రజలు సుగమనము చేయుదురు.

ప్ర: తండ్రీ, సర్వాధికారు లన నేమి, దేనికి అధికారులు?

ఉ: వత్సా, ఒకగృహములో కొందరుజనులుండిరి. అందులో ఆజనులకు యజమానుడు ఒకడుకలడు. అతడేగృహాధికారి. అట్లే ఒకపట్టణములో అనేకప్రజలుందురు వారికిఅందరకు యజమాని చక్రవర్తి ఒకడుండునుగదా, వారేసర్వాధికారులు. ఆమాదిరిగా వ్యష్టిశరీరములోయున్న ఇంద్రియసమూహమునకు ఇంద్రియాది దేవతలకు యజమాని ఒకడుండెను. అతనే (ప్రత్యగాత్మ ఆత్మ సాక్షి ప్రజ్ఞానము తెలివి) అని అనేకవిధములుగా పెద్దలు పలుకుదురు. వారే శరీరాధికారులు. ఆమాదిరిగా సమష్టి పట్టణాధికారులు (సర్వేశ్వరుడు సర్వసాక్షి సర్వాత్మ అనిచెప్ప బడును.) అట్టివారే ఈశ్వరగుణసంపన్నులు సుగుణసంపన్నులును మార్గజ్యోతివేయుదురు. వారే సర్వాధికారులు (యన్త్రారూఢాని మాయయా) అనునట్లు వారివల్లనేసర్వేంద్రియములు పనిచేయు చున్నవి అని తెలియుము. ఆకారణముచేత సర్వాధికారి నామము కలిగెను.

ప్ర: తండ్రీ, ఎంతకాలము ఈప్రశ్నలు అడుగుట, ఎప్పటికి పూర్ణశాన్తి నిత్యతృప్తికలుగును?

ఉ: వత్సా, నీలో పచ్చియున్నంతకాలము లోపలనుంచి విషయవృత్తులు కలుగుచునే యుండును. కారణశరీరము జన్మకుకారణము కనుక కారణబీజము పచ్చిలేకుండా దగ్ధమైన యెడల పూర్ణశాన్తి నిత్యతృప్తి కలుగును.

ప్ర: తండ్రీ, నీవింకోపచ్చి యున్నంతకాలముఅని అంటిరిగదా అనగానేమి, కారణశరీరము పచ్చిలేకుండా దగ్ధము చేయుమంటిరి అదియెట్లు ?

ఉ: వత్సా, కొరివికట్టె అనగా సగముకాలుతూయున్న కట్టె ఆరిపోకుండా పూర్తిగామండకుండా లోలోపలయెట్లు అగ్ని తోను, పొగతోను యుండునో కారణశరీరము ఆమాదిరిగా బాధ కలుగుతూ సంకల్ప వికల్పములకు కారణమై యెంతవిని నను యెన్ని ప్రశ్నలుఅడిగినను తృప్తిలేక ఇంకావినవలెను ఇంకా అడుగవలెను అని కారణశరీరముచేత లోలోపల విషయాగ్ని బాధించుచునే యుండును.

ప్ర: తండ్రీ, కారణశరీరము లోపల యెట్లుండును. స్థూల శరీరముతో సంబంధముండునా లేదా, ఆ కారణశరీరమను కొరకంచు కొరివికట్టె దేనిచేత చల్లారును, ఎప్పుడు శాన్తి కలుగును ?

ఉ: వత్సా, కారణశరీరము లోపల నుండి లేనట్లుగా నుండును. సంబంధములేదు. యెట్లనగా జీవి స్థూలశరీరమును విడిచి వెళ్ళిపోయినప్పుడు స్థూలశరీరము దగ్ధము అగుచున్నది. కారణశరీరము వేరుగా శేషించునుగదా, సంబంధము యున్న యెడల కారణశరీరముకూడా వెంటనే భస్మముకావలెనుగదా, అట్లు అగుటలేదే. కనుక కారణశరీరము వేరుగా యున్నదని తెలియుము. అదేజన్మకుమరల కారణము, ఆ కారణమును నీవు తెలిసి ఇంక జన్మవద్దని తెలిసినయెడల కారణశరీరము జ్ఞానాగ్నిచే భస్మమగును. అప్పుడు జ్ఞానము కలుగును. స్థూల

శరీరమునకు కారణశరీరమునకు సంబంధములేదు. కారణశరీరము పోయినతరువాత జీవన్ముక్తులు విదేహులు అశరీరులు అయి యుండిరిగదా, అదే నీకు దృష్టాంతము. కొబ్బరికాయ పచ్చిగా యున్నప్పుడు కొబ్బరి పెంకును అంటియుండును. అదే పండుపండి కురిడీ అయినప్పుడు పెంకుకి విలక్షణముగా నుండును. వరలో కత్తిమాదిరిగా నుండును. ఇంకా అనేక దృష్టాంతములున్నవి. అనేకమైన బీజములు పచ్చిగాయున్నప్పుడు పైతొక్కకి అంటి యుండును. పరిపక్వదశకువచ్చునరికి విడివడి విలక్షణమై తొక్కకి అంటకుండాయుండును. గర్భములోపిండము జీవి యున్నప్పుడు 9 మాసములకు పూర్వము స్థూలమును అంటియే యుండును. తరువాత క్రమముగా పరిపక్వదశకు వచ్చునరికి గల గలమని, కొబ్బరికురిడీవలెను చింతగుల్లవలెను విలక్షణముగా యుండును. అయితే పచ్చిగాయున్నప్పుడు అంటలేదా అనెద వేమో వినుము స్థూలశరీరముద్వారా చేయుటచేత కొంతవరకు వచ్చియుండును. అందుకే యుండిలేనట్లు అని తెలియుము. కారణశరీరముఅను కొరివికట్టె దేనిచే చల్లారును అనగా పైని వివరించిన ప్రకారము కారణశరీరమును నీవు పూర్తిజ్ఞానాగ్నిచే దగ్ధమొనర్చినయడల (బ్రహ్మానంద వర్షముచేత) శీతలము అగును. పూర్ణశాన్తి పూర్ణతృప్తి కలుగును.

ప్ర: తండ్రీ, ఆకారణశరీరము పూర్తిగా దగ్ధమైనయెడల పూర్ణశాన్తి కలుగునా లేక నామోచ్చారణమువలన చలనము ఏమైనా యుండునా?

ఉ: వత్సా, ఆస్థితిలో నాశములేకుండా నిర్మలశాన్తియే

ప్ర: తండ్రీ, నీవోపచ్చి యున్నంతకాలముఅని అంటిరిగదా అనగానేమి, కారణశరీరము పచ్చిలేకుండా దగ్ధము చేయుమంటిరి అదియెట్లు ?

ఉ: వత్సా, కొరివికట్టె అనగా సగముకాలుతూయున్న కట్టె ఆరిపోకుండా పూర్తిగామండకుండా లోలోపలయెట్లు అగ్ని తోను, పొగతోను యుండునో కారణశరీరము ఆమాదిరిగా బాధ కలుగుతూ సంకల్ప వికల్పములకు కారణమై యెంతవిని నను యెన్నిప్రశ్నలుఅడిగినను తృప్తిలేక ఇంకావినవలెను ఇంకా అడుగవలెను అని కారణశరీరముచేత లోలోపల విషయాగ్ని బాధించుచునే యుండును.

ప్ర: తండ్రీ, కారణశరీరము లోపల యెట్లుండును. స్థూల శరీరముతో సంబంధముండునా లేదా, ఆ కారణశరీరమను కొరకంచు కొరివికట్టె దేనిచేత చల్లారును, ఎప్పుడు శాన్తి కలుగును ?

ఉ: వత్సా, కారణశరీరము లోపల నుండి లేనట్లుగా నుండును. సంబంధములేదు. యెట్లనగా జీవి స్థూలశరీరమును విడిచి వెళ్ళిపోయినప్పుడు స్థూలశరీరము దగ్ధము అగుచున్నది. కారణశరీరము వేరుగా శేషించునుగదా, సంబంధము యున్న యెడల కారణశరీరముకూడా వెంటనే భస్మముకావలెనుగదా, అట్లు అగుటలేదే. కనుక కారణశరీరము వేరుగా యున్నదని తెలియుము. అదేజన్మకుమరల కారణము, ఆ కారణమును నీవు తెలిసి ఇంక జన్మవద్దని తెలిసినయెడల కారణశరీరము జ్ఞానాగ్నిచే భస్మమగును. అప్పుడు జ్ఞానము కలుగును. స్థూల

శరీరమునకు కారణశరీరమునకు సంబంధములేదు. కారణశరీరము పోయినతరువాత జీవన్ముక్తులు విదేహులు అశరీరులు అయి యుండిరిగదా, అదే నీకు దృష్టాంతము. కొబ్బరికాయ పచ్చిగా యున్నప్పుడు కొబ్బరి పెంకును అంటియుండును. అదే పండుపండి కురిడీ అయినప్పుడు పెంకుకి విలక్షణముగా నుండును. వరలో కత్తిమాదిరిగా నుండును. ఇంకా అనేక దృష్టాంతములున్నవి. అనేకమైన బీజములు పచ్చిగాయున్నప్పుడు పైతొక్కకి అంటి యుండును. పరిపక్వదశకువచ్చుసరికి విడిపడి విలక్షణమై తొక్కకి అంటకుండాయుండును. గర్భములోపిండము జీవి యున్నప్పుడు 9 మాసములకు పూర్వము స్థూలమును అంటియే యుండును. తరువాత క్రమముగా పరిపక్వదశకు వచ్చుసరికి గల గలమని, కొబ్బరికురిడీవలెను చింతగుల్లవలెను విలక్షణముగా యుండును. అయితే పచ్చిగాయున్నప్పుడు అంటలేదా అనెద వేమో వినుము స్థూలశరీరముద్వారా చేయుటచేత కొంతవరకు పచ్చియుండును. అందుకే యుండిలేనట్లు అని తెలియుము. కారణశరీరములను కొరివికట్టె దేనిచే చల్లారును అనగా పైని వివరించిన ప్రకారము కారణశరీరమును నీవు పూర్తిజ్ఞానాగ్నిచే దగ్ధమొనర్చినయెడల (బ్రహ్మానంద వర్షముచేత) శీతలము అగును. పూర్ణశాంతి పూర్ణతృప్తి కలుగును.

ప్ర: తండ్రీ, ఆకారణశరీరము పూర్తిగా దగ్ధమైనయెడల పూర్ణశాంతి కలుగునా లేక నామోచ్చారణమువలన చలనము ఏమైనా యుండునా?

ఉ: వత్సా, ఆస్థితిలో నాశనములేకుండా నిర్మలశాంతియే

యుండునుగాని త్రిపుటితోఁగూడిన నామవర్గము ఏమీయుండదు. సుమా, పూర్ణశాన్తిగానే యుండును.

ప్ర: తండ్రీ, దీనదయాపర, త్రిపుటివర్గమునగా నేమి, నామ వర్గ మనగా నేమి?

ఉ: వత్సా, మంత్రము మంత్రాధిష్ఠానము మంత్రార్థము, మంత్రరహస్యము, అని 4 భాగములు. అందులో మంత్ర రహస్యముతక్క మిగతా 3 భాగములు త్రిపుటీవర్గ మన బడును. ఆ 3 భాగములు 4 వ భాగమైన మంత్రరహస్యములో కలిసిపోవును. అప్పుడు నామజపము చేయుచున్నాను అన్న తెలివి లేకుండా యుండును. అదేపూర్ణశాన్తి, నిర్వికల్పసమాధి అనబడును. నామజప మనగా శివ రామ కృష్ణాది నామజప మనియే అభిప్రాయముకాదుసుమా, మహావాక్యములు సహి తము నామవర్గమే. నేను బ్రహ్మము నేను సచ్చిదానంద స్వరూ పము. అన్న తెలివికూడా యుండకూడదు. అంతా నిర్లక్ష్య ముగా నిర్మలముగా నిరామయముగా నుండవలెను.

ప్ర: తండ్రీ, వివేకజ్ఞానముచేత, శాన్తికలుగునని శలవిచ్చితిరి గదా, మళ్ళీ నామజపము యెందులకో దయతో శలవిండు?

ఉ: వత్సా, వివేకజ్ఞానముచేత నాచు తొలగించునట్లు మాయను శరీరత్రయమును తొలగించితివేని సరియే. లేని యెడల నామసహాయముచేత భక్తి, భక్తిసహాయముచేత పూర్ణజ్ఞానము కలుగును. ఆపూర్ణజ్ఞానమే మంత్రరహస్యము సుమా. నీవు ఏమార్గముగా నేగినను సరియే. ఏనామమైనను సరియే. మంత్రరహస్యములో కలియును.

ప్ర: తండ్రీ, అదెట్లో నాకు అర్థమగుటలేదు. ఏమార్గముగా నైనను సరియేఅంటిరిగదా మీఅభిప్రాయమేమిటి ?

ఉ: వత్సా, నీవు ఒక రాజువద్దకువెళ్లి స్థిరాన్నమనుభిక్షము అడుగువలెనని నీకుఆలోచన యున్నదనుకొనుము. అయితే నీవు ఆ రాజువద్దకు ఒంటరిగా వెళ్లగలవా. వెళ్ల లేవుగదా ! ఎందు చేతననగా ఆరాజువద్ద ముఖ్యముగా ఒకమంత్రియుండును. అనేకులసంగతి చెప్పనవసరములేదు. ఆముఖ్యమంత్రి సహాయము లేక నీవు వెళ్లలేవుగదా ! ఆమంత్రియే మంత్రముసుమా. కనుక నీవు మంత్రిసహాయముచేత భక్తి, భక్తిసహాయముచేత అనన్యభక్తి దానిసహాయముచేత వెళ్లిననుసరియే లేకపోవు నిత్య వస్తువును వివేకముచేత పరిశోధించి స్వంతబలముచేత స్వస్వ రూపముగలవాడవైనను సరియే స్వారాజ్యసుఖమును పొంద గలవు. సందేహము లేదు. ఆత్మరాజ్యమును పొందుము.

ప్ర: తండ్రీ, స్వంతబలము చాలనప్పుడు మంత్రిసహాయము ఉండవలెననియే అనుకొనెదను మీఅభిప్రాయమేమి ?

ఉ: వత్సా, నీవు భగవన్నామమను వోడనెక్కినప్పుడు తప్పక వొడ్డుచేరగలవు. నీకు యెంతమాత్రము సందేహము లేదు. నీవు అనన్యభక్తితో భక్తిరసముతో నామముచేయు నప్పుడు నామమనగా మహావాక్యములను నిజనామము చేయు నప్పుడు నామరూపరహితమైన నామము చేయునప్పుడు (నిర్గుణమును) చేయునప్పుడు మహావాక్యములద్వారా నీకు పూర్ణశాన్తి తృప్తి కలుగును. ఆ స్థితిలోనుంచి నీవు కర్మ వశాత్తు జారినయెడల నామసహాయము నీకుకలుగును. దాని

సహాయముచేత కొంతఅభ్యాసముచేయగా మంత్రరహస్యములో కలియుదువు పరమశాన్తి కలుగును.

ప్ర: శ్రీంగ్రీ, మంత్రవర్గముతో త్రిపుటివర్గమును కొంత వివరించ కోరుచున్నాను.

ఉ: వత్సా, వినుము. (1) మంత్రము (2) మంత్రార్థము (3) మంత్రాధిష్ఠానము (4) మంత్రరహస్యము అని 4 భాగములుగదా, నీకు ఒక దృష్టాంతమును చెప్పెదను వినుము. ఒకనికి కడుపునొప్పి వ్యాధి యున్నది. ఆ వ్యాధి పోవుటకు డాక్టరువద్దకువెళ్లి మందుమాత్ర వేసుకొనినచో వ్యాధిపోవును గదా. (1) మాత్ర (2) మాత్రఅర్థము అనగా ఈమాత్ర ఏమిపనిచేయును అని విమర్శ. 3) మాత్రఅధిష్ఠానము మాత్రను యెవరు ఇచ్చిరి — అనిన డాక్టరు ఇచ్చెను. కనుక మాత్రకు అధిష్ఠానము డాక్టరు (4) మాత్రరహస్యము అనగా మాత్రను తానుకంఠములో వేసుకొనినచో మాత్ర తాను ఒకటి అయినప్పుడుగదా మాత్రపనిచేయును. మాత్రను కళ్లతో చూచుటచేత వ్యాధి నివారణ కాదుగదా. కనుక మాత్ర తాను ఒకటి కావలెనని అదే మాత్రరహస్యము. అది 4 భాగములు.

(1) మాత్ర (2) మాత్రచేయుపని ఏమనగా వ్యాధినిపోగొట్టి పూర్వానందమును కలుగచేయును. అనగా ఈవ్యాధికి పూర్వము తాను ఆనందముగాను ఆరోగ్యముగానే యుండెను. ఈవ్యాధి మధ్యను వచ్చినది. కనుక ఇప్పుడు మాత్ర వేసుకొనినచో పూర్వానందము కలుగును (3) మాత్ర అధిష్ఠానము

డాక్టరుచేమాత్ర ఇవ్వబడెను. ఈమాత్రకి కర్త అధికారి డాక్టరు (4) మాత్రరహస్యము అనగా వ్యాధిగ్రస్తుడై ఆతుర తగా యున్నప్పుడు డాక్టరుచెప్పిన లక్ష్యమునందు మాత్ర యుండున్న లక్ష్యమునమ్మకమువలన ఆమాత్రను తాను కంఠములో వేసుకొనినందువల్లను నీవ్యాధిపోయి నిర్మలముగా యుండును. మాత్ర నీవు ఒక్కటిఅయినచో వ్యాధిపోవును అనిచెప్పానుగదా, అట్లే ఇక్కడ అభిప్రాయమును తెలియుము.

ప్ర: శ్రీస్వామీ, ఇక్కడకమువునొప్పి అనిచెప్పితిరిగదా అక్కడ సాధకునికి వ్యాధిఏమి ?

ఉ: నత్సా, భవరోగవ్యాధి పుట్టుట చచ్చుట, మరలపుట్టుట చచ్చుట. ఇట్టి జనన మరణములతో గూడినవ్యాధి నివారణ కొరకు మాత్రయనుమంత్రమును ఉపయోగపరచినయెడల నీభవ రోగము నివారణమైపోవును. (1) భగవన్నామమను మంత్రమే మందు (2) మంత్రార్థము అనగా ఈ మంత్రమువలన ఏమి ప్రయోజనము యేమిచేయును అనగా భగవన్నామము భక్తిచే గాని జ్ఞానముచేగాని యేవిధముగానైనను చేసినయెడల నీభవ రోగ నివారణ మగును (3) మంత్రాధిష్ఠానము అనగా ఈమంత్రమునకు అధిపతియెవరు, యెవరిని మనము ఆశ్రయించిన మనకు ఈభవరోగ నివారణమగును, డాక్టరు సహాయముచేత మందుతీసుకున్నట్లు భగవత్సహాయముచేత నామమంత్రము తీసుకొనినచో మంత్రముపనిచేయును. అందుకు అధిష్ఠానమును తెలియవలెను. అధిష్ఠానము యెవరనగా (శివ రామ కృష్ణాది) (మహావాక్యములు సహితము) అనేకనామము లున్నవి గదా

ఏమంత్రముగాని ఏనామముగాని చేసినప్పుడు ఆ అధికారులనే ధ్యానించవలెను (4) మంత్రరహస్యమనగా మాత్ర తానుఒక్కటి అయినట్లు భక్తిరసము అనన్యభక్తితో గూడి నామముచేయు నప్పుడు శబ్దాకారము అగును. అక్కడఅనేకనామములకు మూల రహస్యము పరమాత్మఅని తెలియును. అనగా పైనివివరించిన ప్రకారము పూర్ణానందమును పొందును. మధ్యనువచ్చిన భవ రోగనివారణ అవును. అష్టస్థానములో సర్వము లీనమగును. ఈరహస్యము గురుముఖతః తెలియవలెనుగాని వాక్కుచే చెప్పు టకు సాధ్యముకాదు.

ప్ర: తండ్రీ, నేను భగవద్ధ్యానములో నున్నప్పుడు ప్రార బ్ధముతాలూకు కర్మలు వచ్చినప్పుడు యెట్లు చేయగలను.

ఉ: వత్సా, నీవు ఒక ఊరు వెళ్లునప్పుడు రైలుయెక్కి నీసామానులు ఒకమూలపెట్టినప్పుడు నీవు సుఖముగాకూర్చుం దువుగదా అప్పుడు నిన్ను నీసామానులనుకూడా రైలు మో యుచు ఈడ్చుకొనిపోవుచున్నది గదా, అట్లే నీవు భగవద్ధ్యాన ములో నున్నప్పుడు నీభారమంతయు ప్రారబ్ధముయొక్క భారము సర్వేశ్వరుడుమోయును నిన్ను లాగుకుపోవును. కూపములోబడిన వానిని బయటికిలాగినట్లు లాగును (అనన్యాశ్చిన్తయన్తోమామ్) అనునట్లు నీభారముఅంతయు సర్వేశ్వరునిదే అని నీవు త్రికరణ శుద్ధిగా నమ్మి ధ్యానము చేయుము. నీకు ఏమీ భయములేదు భారములేదు.

ప్ర: శాన్తినిలయా, రైలుప్రయాణమునకు జీవయాత్రకు పరిపోల్చితిరిగదా రైలు సామానులను మోయును. ఎక్కడ

నుండిపోయును. రైలు కనపడుచున్నదిగదా సర్వేశ్వరుడు కన పడుటలేదే ?

ఉ : రైలుబండికి ముందుగా ఇంజనుండును. దానిలో డ్రైవరుండి ఇంజనును సూటిగా జాగ్రత్తగా నడుపును. అప్పుడు దాని కరంటుచేత వరుసగాయున్న పెట్టెలన్నీ చివరవరకూ వదలును గదా, పెట్టెలు పెట్టెలలోనిజనము జనముతాలూకు సామానులు మొదలగువాటిని ముందుఇంజను లాగుచున్నది. నిమిత్తమాత్రముగా ట్రైనరుండెను ఆమాదిరిగా సహస్రారమునందు ఒకడ్రైవరుండెను సుమా! అతనే సర్వేశ్వరుడు. సహస్రారమునందున్న సర్వేశ్వరుని నీవు (అనన్యభక్తిచేతగాని, జ్ఞానముచేతగాని) ధ్యానించినయెడల నీసర్వభారములను అతనే భరించును. సర్వేంద్రియ వ్యాపారమునకు నీజీవయాత్రనడుపుటకు అతనే ముఖ్యకర్త. నీలో ఏమీలేదుసుమా! ఆమూల రహస్యమునందు లక్ష్యమునుంచి సహస్రారమునందున్న సర్వేశ్వరునియందు లక్ష్యముంచి ధ్యానించుము. నీసర్వభారములు సర్వకర్మలు హరించును.

ప్ర : తండ్రీ, సమష్టి జగద్వ్యాపారకుడు సర్వేశ్వరుడని శలవిచ్చితిరిగదా, ఇప్పుడు సహస్రారమునయున్న సర్వేశ్వరుడని శలవిచ్చుచున్నారే ఏమిది ఆశ్చర్యముగానున్నదే! ఇద్దరు సర్వేశ్వరులు ఉండవచ్చునా, ఈ సంశయము ఏవిధముగా బోధ చేసిన నాసందేహము తీరునో మీరే ఆలోచించి బోధపరుప వలెనుగాని నాకుఏమీ తోచుటలేదు.

ఉ : వత్సా, తొందరపడి గాభరావడకుము, నెమ్మదిగా

ఆలోచించుము. ఇద్దరు ఒక్కటియే సుమా, ఇది పరమ రహస్యముసుమా, నీసర్వభారములు వానికిసమర్పించి నీవు నిర్మలధ్యానములో నున్నప్పుడు నీభారము అంతయు అతనిదే గదా, నీసర్వము సర్వేశ్వరునిలో లీనమగును. గొలుసుపెట్టెలు అన్నీ కదలుటకు ఆధారము ఇంజనుగదా, అందుకే దానికి మిగతా పెట్టెలకన్న విలువ యెక్కువ కలిగెను. ఆమాదిరిగా నీశరీరము అంతలోను సహస్రారమునకు విలువ యెక్కువ కలిగెను. ఆకారణముచేతనే ఆస్థానము సర్వేశ్వరునిది. దానికే బ్రహ్మరంధ్రమనికూడా పేరు. (సహస్రశీర్షా పురుషః) అనునట్లు (బ్రాహ్మణోஉస్యముఖమాసీత్,) అనునట్లు సహస్రారమునకు విలువ కాంతి అనగా (బ్రహ్మతేజస్సు) యెక్కువగా యుండెను.

ప్ర: తండ్రీ, సమష్టి సర్వేశ్వరుడు, సహస్రారమున సర్వేశ్వరుడు ఇద్దరు ఒక్కటి యెట్లగును?

ఉ: వత్సా, ఎలక్ట్రీదీపముల పవరుహౌస్ యున్నదనుకో అక్కడనుంచి క్రమముగా పట్నము అంతకీ వీధులలో ఇండ్లలో సర్వలైట్లకీ ఆధారము పవరుహౌసు తాలుకు సూత్రమేగదా మన ఇండ్లలో దీపములకు ఆఫీసులో కరంటుకి మధ్యను సూత్ర ప్రాయము యొక్కటి యున్నదిగాని విడిపోలేదుగదా ఆమాదిరిగా జగత్తుఅంతా నిండియున్న సర్వేశ్వరునకు సహస్రారమున నున్న సర్వేశ్వరునకు సాక్షికి (సూత్రేమణి గణా ఇవ) సూత్ర ప్రాయ మని తెలియుము, భేదములేదు. వేరులేదు ఆకరంటు చేతనే ఈకరంటు పనిచేయుచున్నది గాని ముమ్మాటికి నీలో ఏమీలేదుసుమా, ముమ్మాటికి నీవు తెలియవలసిన పరమ

రహస్యము ఇదేసుమా (యన్త్రారూఢాని మాయయా, అను నట్లు తెలియుము. రెండింటికిమధ్యనున్న అహంవృత్తిని నేను చేయుచున్నానుఅను అభిమానమును చంపమనేగదా 18 అధ్యాయములు భగవంతుడు పార్థునకు ఉపదేశించెను. గీతా అభిప్రాయము ఇదేసుమా, కనుక నేను నీవు అను అహంభావన, విపరీతభావన ఇప్పుడైనను చంపుము. నాయనా నీకింకబాగుగా యుంటే భగవద్గీతోద్దేశము నీకు బోధపడును.

ప్ర: తండ్రీ, గరికపోచ మొదలు బ్రహ్మవరకు ఈశ్వర సృష్టి అంటిరి. ఈశ్వరసృష్టి అంతా మిథ్య అంటిరి. అయితే పరమేశ్వరుడు యెక్కడ యుండెనని తెలియగలను?

ఉ: వత్సా, గరికపోచ మొదలు బ్రహ్మపర్యంతము సర్వము చైతన్యముగను అంతర్యామిగను పరమాత్మ యుండెను.

ప్ర: తండ్రీ, సర్వములోను పరమాత్మ యుండెనని దృష్టాంత మేమి?

ఉ: వత్సా, వినుము (1) అర్జుననకు శ్రీకృష్ణమూర్తి విశ్వాకారము అంతయు విశ్వరూపముగా చూపలేదా, (2) గరికపోచ మొదలు బ్రహ్మవరకు సర్వములోను సర్వేశ్వరుడు ఉండుటచేతనే ప్రథమములో గరికపోచ విఘ్నేశ్వరునకు సమర్పించుటకు కారణమైనది. గరికపోచకే అంత విలువ యున్నప్పుడు మిగతాపుష్పముల సంగతి చెప్పవలయునా! గరికపోచ విఘ్నేశ్వరునకు సమర్పించుటలో అభిప్రాయ మేమనగా నేను ఇంతదీనుడను నేను ఇంతతృణప్రాయుడను ఈతృణముకన్న వేరుపదార్థము యేమియు నీకు సమర్పింపలేను.

అని అతిదీనత్వముతో దీనదయాపరుని వేడుకొని త్వర మైనను ననుధ్ధరింపుమని ముఖ్యాభిప్రాయము. కనుక సృష్టి అంతయు నశించునుగాని సృష్టిఅంతలోను నున్నపదార్థములకు నశింపులేదు. వాసనారూపముగా సర్వములోను ఉండును. అదే సర్వాత్మఅనబడును. దానిని యెట్లు తెలిసికొనవలెననగా (నిర్వైరస్సర్వభూతేషు) అనునట్లు సంగరహితుడై శత్రుమిత్ర భావనలేక సర్వాత్మభావనలతోనున్నవానికే ఆమహిమ తెలియును. సమస్తభూతములందు విరోధరహితుడు కావలయును. అదేనీవు ముఖ్యముగా తెలియుము. తృణములో జీవచైతన్యము ఉండుటచేతనే గరికపోచకూడా సర్వేశ్వరునకు సమర్పించుటకు విలువకలిగినది. తృణములో సర్వేశ్వరుడున్నందుకు దృష్టాంతరము (కేనోపనిషత్ శృతి) ప్రమాణము.

ప్ర: తండ్రీ, బ్రహ్మనిష్ఠునియొక్కదృష్టి సదా యెట్లుండును? యెట్లు వ్యాపారము చేయును?

ఉ: వత్సా, చిన్నపిల్లలదృష్టివలె నుండును. అనగా చిన్నపిల్లలు ఏదిచూచినా ఏదివినినా ఇదినిజము ఇదిమిథ్య ఇది పుణ్యము ఇదిపాపము అన్నఆలోచనలేదు. చిన్నపిల్లలచేతిలో ఒకపుస్తకమున్నయెడల అటు ఇటు పేజీలు తిరుగవేయును గదా, ఆగ్రంథములోలూపు విమర్శగాని పరిశీలనగాని ఏమైనా యున్నదా? లేదుగదా. అటువలెనే బ్రహ్మనిష్ఠుడుచేయు సర్వకార్యములు మిథ్యాభూతములుగానే యుండునుగాని దాని వలన ప్రయోజనము ఏమీలేదు. దృష్టి ఒకచోటనున్నప్పుడు ఇక్కడ దేహేంద్రియములచేత చేయుపని యెంతనిష్ఫలమో

అట్లే బ్రహ్మజ్ఞానిదృష్టి సదా స్థిరాత్మయం దుండుటచేత దృష్టిగోచరమగు సర్వపదార్థములయందు ఏకదృష్టియే యుం డునుగాని బ్రహ్మేతర పదార్థమును చూడడు.

ప్ర: ఈశ్రీ, జీవచైతన్యము శరీరములో ఎట్లుప్రవేశించును? తిరిగి యెట్లు వెళ్లిపోవును. పోవునప్పుడు శరీరధర్మములు అంటునా అంటవా. శరీరధర్మములను విడిచివెళ్లునా, కూడా తీసుకపోవునా?

ఉ: వత్సా, వర్షబిందువు భూమిమీదపడినట్లు జీవచైత న్యము హృదయభూమిమీద పడును. అక్కడ యెట్లుండు ననగా (పద్మకోశప్రతీకాశగ్ం హృదయం చాప్యధోముఖమ్) ఆప్రకారముగా అధోముఖముగా నుండును. వాసనారూప ముగా వాసుదేవమూర్తి నీహృదయములో నుండును. ఆ (వాసుదేవతత్త్వమును) నీవు తెలిసి ధన్యత్వమును పొందుము. భూమిమీద నీరుమాదిరిగా నుండును. తిరిగి వెళ్లినప్పుడు వర్షబిందువు భూమిమీదపడి తిరిగి ఆవిరిరూపముగా వెళ్లునట్లు వెళ్లును. ఆవిరిరూపముగా వెళ్లినప్పుడు భూమిధర్మములు ఏమీ అంటకుండా నిర్మలఉదకము ఆవిరిగా పోవునట్లు శరీరధర్మ ములు అంటక శుద్ధముగా తిరిగివెళ్లిపోవునుగాని శరీరధర్మ ములు అంటవు. కూడా తీసుకపోనవసరములేదు. వర్షబిందువు భూమిమీదపడి తిరిగి ఆవిరిరూపముగా పోవునట్లు పోవునుగాని భూమిధర్మములు అంటవు. ఆమాదిరిగా ఈశ్వరసృష్టిలో చైత న్యము హృదయభూమిలో పడుటచేత జీవచైతన్యమని చెప్ప బడును. హృదయసంగము కలిగేసరికి జీవత్వము కలిగినది.

నీకు నిర్మోహము నిష్కామము అయితే సరియేనా? పూర్వము తాలూకు త్రిపుటివర్గము దేహత్రయములతో గూడిన కర్మలు అడ్డువచ్చును. అనేకవిఘ్నములు వచ్చును.

ప్ర: తండ్రీ, విఘ్నములు ఎట్లు తొలగును? సారమును ఎట్లు గ్రహింపవలెను?

ఉ: వత్సా, (హంసో యథాక్షీరం) అనునట్లు హంసక్షీరములోనున్న నీరు ఏవిధముగా వేరుగా విభజించునో ఆ మాదిరిగా (ఇవాంబుమధ్యాత్) సంసారసాగరముమధ్య నున్నవారు (యత్సారభూతం) సర్వజగత్తులోను సర్వసంసారములోను సర్వదేహేంద్రియములలోను సారమును (వాసుదేవతత్వమును) గ్రహించవలెను.

ప్ర: తండ్రీ, సారమునుగ్రహించి ఏమిచేయును. విశదపరుచుము.

ఉ: వత్సా, (తదుపాసితవ్యం) అనునట్లు సర్వములోను స్థిరాత్మను సారమును నీవు ఉపాసించవలెను. శ్రవణ మనన నిధిధ్యాసనలద్వారా తెలియబడును. ఆమాదిరిగా తెలిసి మానవశరీరమును మానవజన్మమును సంరక్షించుకొనవలెను.

ప్ర: తండ్రీ, మీ అభిప్రాయమేమి. పూర్తిగా బోధపడలేదు. తెలుపవేడెదను.

ఉ: వత్సా, నాయనా, వినుము. చతుర్దశభువనాత్మకమైన బ్రహ్మాండమునందు ఏసద్వస్తువు సారభూతముగా నున్నదో అనగా (బ్రహ్మసత్యం జగన్మిథ్య)అనునట్లు సర్వముమిథ్య అయినను సర్వములోను సారమునుగ్రహించి ఉపాసించదగినదని

తెలిసి మానవజన్మ రక్షించుకొనవలెను. ఇట్టి పవిత్రజన్మ శరీరము మరిదొరకుట దుర్లభము. కనుక ఎన్నిశ్రమలనైనను ఓర్చి సారమును నిజస్థితిని తెలియుము. ఎన్నిసార్లు బోధించినను ఏమార్గముగా చెప్పినను సారము అర్థము ఒక్కటేనుమా. ఏమందుచేత వ్యాధి నివారణ అగుచున్నదో తెలిసి, ఆమందే పూర్తిగా వ్యాధి నివారించుకొరకు ఉపయోగించును గదా. అట్లే ఎన్నిసార్లు అడిగినా ఎంతబోధచేసినా పదార్థము ఒక్కటేగదా.

ప్ర: తండ్రీ, విషయమును నిగ్రహించుటకు గురువాక్యము చాలునా దృష్టాంతరము ఏమైనా చూపెదరా?

ఉ: వత్సా, విషయము వచ్చినప్పుడు సమత్వముతో నిగ్రహించుటకు పంచభూతములే నీకు దృష్టాంతరము.

ప్ర: తండ్రీ, అదెట్లో తెలుపకోరెదను. మీకు శ్రమకలుగ చేయుచుంటిని క్షమించ ప్రార్థన.

ఉ: వత్సా, నీవు నిత్యశాంతినిపొందితే నాకు ఏమీ శ్రమ లేదు. పంచతన్మాత్రలనుగురించి ఇదివరకు నీకుబోధించితినిగదా ఆరహస్యము తెలియుము.

ప్ర: తండ్రీ, పిల్లలు తెలివితక్కువచేత అడిగినదే 10పర్యాయములు అడిగెదరు. తల్లిదండ్రులు వారికి శాంతముతో జవాబు చెప్పెదరు. అట్లే నాతప్పులు క్షమించి పంచభూతములను వివరించ గోరుచున్నాను.

ఉ: వత్సా, (1) ఆకాశము ఎంతనిర్మలముగా ఎంతశాంతిగా ఎంతసుఖముగా నుండునో నీహృదయము అంతనిర్మలముగా అంతశాంతిగా నుండవలెను.

ప్ర: తండ్రీ, ఆకాశమనగానేమి, దాని ఉపయోగమేమి?

ఉ: వత్సా, ఆకాశము అనగా అవకాశము. అవకాశము లోనే పట్నములు పల్లెలు ఇండ్లు తోటలు మొదలగు 14 భువనములు 14 లోకములు ఈశ్వరసృష్టి అయినది. అయినను అవకాశమునకు ఏమీలోపము లేదుగదా! ఎప్పటివలెనేయుండెనుసుమా సృష్టితాలుకు చిత్రవిచిత్రములు ఆకాశమునకు అంటలేదుగదా, అట్లే నీహృదయాకాశములో మనస్సుతాలూకు సంకల్ప వికల్పములతో ఎంతసృష్టి అయినను నిర్మలముగానేయుండెను. నిర్మలాకాశమునకు ఏమీలోపములేకుండా తరుగు విరుగులు లేక నిశ్చలముగా నుండును. అని నీవు తెలియుము. అవకాశములో 14 భువనములు ఉన్నప్పటికీ అవకాశము నిస్సంగముగా యెట్లుండెనో నీహృదయాకాశములోకూడా 14 భువనములు ఉన్నప్పటికీ నీవు నిస్సంగముగా నుండుటే ముఖ్యాభిప్రాయము. నీహృదయాకాశములో 14 భువనములు యున్నప్పటికీ అది ఈశ్వరసృష్టి. ఆ సృష్టితో సంబంధములేదని తొలగించి వాటితో నీవు కలియకుము. నిస్సంగముగా యుండుము అదే (అసంగ శస్త్రేణ) అనబడును.

ప్ర: తండ్రీ, ఎంత ఆశ్చర్యము తెలిసినది. తరువాత ఏమి జరిగినది?

ఉ: వత్సా, (2) వాయుమహాభూతమును చెప్పెదను వినుము సర్వజగత్తుతాలూకు చెత్త తొక్కు అంతయు పెద్దగాలి వేయునపటికి ఎగిరిపోవును. నీవు ఆమాదిరిగా సర్వజగత్తువర్గము జన్మజన్మార్జిత దోషములను చెత్తను దేహత్రయ వర్గముతోగూడిన

సర్వవిషయములు 140—వాయుభూతమువలె ఎగరగొట్టుము. గాని విషయమును దరిచేరనీయకుము.

ప్ర: తండ్రీ, వాయుభూతమువలె సాధకునికి అంతశక్తి గలదా? కలుగునా? తెలవిండు.

ఉ: వత్సా, ధైర్యము పూనిన కొండపిండిచేయును గదా, ఆశక్తి కలుగుటకు ఏదైనా నమ్మకములో యున్నది. దృఢముగా నమ్మినయెడల అన్నీ అప్పుడే జయప్రదమగును. ఆ మాదిరిగా వేగముతోగూడిన వాయుమహాభూతము తాలూకు మనస్సుని జయించగునేగదా శ్రీకృష్ణమూర్తి అభిప్రాయము. కనుక సందేహములేదు. నమ్మినయెడల ఆశక్తి కలుగును. (3) తరువాత అగ్నిమహాభూతము. యెట్టిపదార్థము అగ్నిలోవేసినను వెంటనే భస్మము అగును. అట్లే నీవు ఎట్టివిషయములు వచ్చినను జ్ఞానాగ్నిచేత దగ్ధముచేయుము. (జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి) అనునట్లు విషయమువచ్చినప్పుడు జ్ఞానముచేత తెలిసితివేని సర్వవిషయములు దగ్ధములగును. సందేహములేదు. మందమతిని మాత్రము విడువుము.

ప్ర: తండ్రీ, మహాప్రసాదము చాలసంతసించితిని పూర్తిగా తెలవిండు.

ఉ: వత్సా, (4) జలమహాభూతము ప్రవాహము రసస్వరూపముగదా. అట్లే యెట్టివిషయములు వచ్చినను నీవు రసస్వరూపముగా అమృతస్వరూపముగా చూడవలెనుగాని విషయముగా చూడకూడదుసుమా.

ప్ర: తండ్రీ, దృష్టాంతరమేమి? విషయమును అమృతముగా ఎట్లుచూచుట ?

ఉ: వత్సా, ప్రహ్లాదుడు అనన్యభక్తిచే తల్లితండ్రులు విషముపెట్టినప్పుడు అమృతప్రాయముగా స్వస్వరూపముగా చూడలేదా. భక్తిభావనలోనే చూచినప్పుడు జ్ఞానముతో తెలియుటలో ఆశ్చర్యమేమియున్నది.

ప్ర: దీనదయాపర, మోక్షమనగా ఇంతకష్టమా? ఇన్ని కష్టము లున్నవా, ఇంత కఠినమార్గములు దాటవలయునా? ఇంతకష్టమని ఇన్నిరోజులనుంచీ తెలియకపోయనే. ఆహా పరమేశ్వరా, తరువాత ఏమిచేయువలెను?

ఉ: వత్సా, అవును, మోక్షముఅంటే ఏమిఅనుకొంటివి. ఇన్నిఘాటీలు దాటవలెనుసుమా! అప్పుడు కరతలామలకము అగును. (5) పృధ్వీమహాభూతము కఠినస్వరూపముగదా, ఎట్టివిషయములువచ్చినా అనగా మోహపాశములు అభిమాన రాగము నావారు అను మమత. ఈ దుర్గుణములు వచ్చి నప్పుడు హృదయము మనసుజారిపోకుండా యుండవలెను. ఎన్నివిషయములువచ్చినా కాళ్లకు త్రాచుపాము చుట్టు కొన్నట్లు చూపవలెను. అనగా కాళ్లకు పాముచుట్టుకుంటే యెంతకఠినముగా కాలువిదలించుచున్నామో అంతకఠినముగా విషయమును ఖండించవలెనుగాని గురులక్ష్యములోనుంచి జారిపోకూడదు సుమా! పృధ్వీమహాభూతములోయున్న మహిమగ్రహించితివా. గునపము మొదలైన ఇనుపసామా నులతో యెంతపొడిచినను కఠినత్వముగా ఎట్లుండెనో సాధకుడు

మానాభిమానములను జయాపజయములను నిందాస్తోత్రము లను శూలములపోట్లకు ఆగవలెను. ధీరత్వముగా దృఢముగా నిలబడవలెను. కుమారా, నీవుకోరినప్రకారము అనేకదృష్టాంత రములు ఉపమానములు చూపబడెను గ్రహించుము.

ప్ర: తండ్రీ, తెలిసితిని. చాలసంతసించితిని. అయితే ముఖ్యముగా సర్వేశ్వరునకు యేమిసమర్పించవలెను ?

ఉ: నాయనా, నేను అన్న అహం పదార్థము విడువుము. సర్వేశ్వరునకు సమర్పింపుము.

ప్ర: తండ్రీ, పత్రం పుష్పం ఫలం తోయం అని పెద్దలు తెలవిచ్చిరిగదా, వాటి అభిప్రాయము ఏమి ? అంతరార్థము తెలపియ్య వేడెదను ?

ఉ: వత్సా, (1) పత్రమనగా శరీరత్రయ అభిమానమే పత్రము. ఆ అభిమానమను పత్రమును సమర్పింపుము. వృథాఅభిమానమును అభాసపడకుము. (2) పుష్పమనగా హృదయకమలము. అనన్యభక్తిచే బాగుగా వికసించిన హృదయకమలము సర్వేశ్వరునకు సమర్పింపుము.

ప్ర: తండ్రీ, అర్థముగుటలేదు. కొంచెము విశదపరుప వలెను ?

ఉ: వత్సా, నామనస్సు నాబుద్ధి నాచిత్తము నాఅహం కారము అంతఃకరణము అని అహంభావముతోగూడక వాటికి నీవు విలక్షణమై ఆ 5 రేకులతోగూడిన హృదయకమలము సమర్పింపుము.

ప్ర: తండ్రీ, హృదయకమలమునకు 5 రేకులు యెట్లుం

డును? దానికి సాధకుడు విలక్షణముగా ఎట్లుండును? బోధింపుడు?

ప్ర: వత్సా, చెట్టున పుష్పించిన పుష్పము 5 రేకులతో కొన్ని పుష్పములుండును గదా, అట్లే ఆ పుష్పమునకు మధ్య భాగములో సూక్ష్మముగా ఒక అణువు పదార్థము ఉన్నది. అది రేకులకు విలక్షణముగా నుండును. అట్లే శరీరవృక్షములో అంతఃకరణ మనస్సుబుద్ధి చిత్తము అహంకారము అను 5 రేకులతో పుష్పము ఉండెను. దానిలో మధ్యగా సూక్ష్మముగా రేకులకు వేరుగా నుండును. శరీరవృక్షములో పుష్పము నుండెను. దానిలో మధ్యగా సూక్ష్మముగా ఒక అణుపదార్థ మున్నది. ఎట్లనగా అద్దముమీద ప్రతిబింబమువలె అంతః కరణప్రతిబింబమని తెలియుము. అట్టి హృదయకమలము గ్రహించి సమర్పింపుము.

ప్ర: తండ్రీ, ఫలమనగానేమి తోయమనగానేమి శలవిండు?

ఉ: వత్సా, (3) ఫలమనగా నీవు సర్వేంద్రియములచే చేయబడు సర్వవ్యవహారములకు నేను కర్త నేను భోక్త అని వృథాభిమానమును పొందుచున్నావు కనుక ఆ అభిమానమనే ఫలితమును నీవు సర్వేశ్వరునకు సమర్పింపుము. నిష్కామముగా చేసి ఫలితమును పరమేశ్వరునకు విడువుము. అదే ఫలము. (4) తోయమనగా ఆనందబాష్పములు అనగా ఆనందమయకోశము తాలూకు ఆనందజలమును భగవదర్పితము చేయుము.

ప్ర: తండ్రీ, ఇంకా నేమి భగవంతునకు సమర్పించవలెను, దయతో శలవిండు?

ఉ: కుమారా, చక్కెరను ముఖ్యముగా సర్వేశ్వరునకు సమర్పించవలెను. దానివలన నీకు చాల విశేషము కలుగును అనగా శేషము లేకపోవుటే విశేషము. బాగుగా గ్రహించుము. శాస్త్రించుము.

ప్ర: తండ్రీ, అన్ని పదార్థములకన్న చక్కెర విశేషమేమి?

ఉ: వత్సా, చక్కెర తీపిగనుండు నీవు చక్కెరను సమర్పించిన మొదల శరీరము అంతరమున ఉన్న తీపివిడిపోవును. చక్కెరను సమర్పించునట్లు శరీరత్రయములో తీపిని అర్పింపుము సుఖించుము.

ప్ర: తండ్రీ, శరీరములో తీపిని యెట్లు అర్పించవలెను. చక్కెర అర్పించుటలో అభిప్రాయమేమి?

ఉ: వత్సా కుమారా, చక్కెర తియ్యని పదార్థమని తెలిసి మధురపదార్థమును ఎంతప్రీతిగా పరమేశ్వరునకు అర్పించుచున్నావో ఆ మాదిరిగా శరీరత్రయములోనున్న తీపిని పరమేశ్వరునకు ప్రీతితో సమర్పింపుము.

ప్ర: తండ్రీ, అన్నీ ఆవిధముగా సర్వేశ్వరునకు ధారపోసిన ఇంక ఏమియున్నది. ఏమీలేదే ఇంక అర్పించవలసినది ఏదీలేదే.

ఉ: వత్సా, అవును (సర్వధర్మాన్ పరిత్యజ్య) అనునట్లు ఏమీలేదు. నేను నాది అను అభిమానము యెంతవరకు ఉన్నదో? అంతవరకు సమర్పించుము. అహంవృత్తి లేనప్పుడు సమర్పించవలసినదేదీలేదు. అంతా సర్వేశ్వరుడే అంతా వాసుదేవుడే అంతా (వాసుదేవ తత్త్వముతో) నిండియుండెను.

ప్ర: దయారస, అంతా ఈశ్వరసృష్టి అయినప్పుడు చరా

చరములు గరికపోచ మొదలు బ్రహ్మపర్యంతము ఈశ్వరసృష్టి అయినప్పుడు నేనుఅన్న అహంపదార్థముకూడా ఈశ్వరసృష్టే గదా ఇంకనేను సమర్పించ వలసినదేది ?

ఉ: వత్సా, సరే యేమీలేదుగాని ఆవాక్యము ఆవేద వాక్యము నీకు దృఢము కావలెను. మధ్యమధ్యను నేను అన్న అభిమానము ఉండకూడదు. మానవజన్మ వచ్చినందుకు ఫలితము అంతా అఖండపరిపూర్ణ పరబ్రహ్మమని తెలిసి సర్వవృత్తులనుచంపి జీవయాత్ర పూర్తిచేయవలెను, ఇదే శ్రీకృష్ణ పరమాత్మ ముఖ్యాభిప్రాయము.

ప్ర: కరుణానిధి, భక్తునకు జ్ఞానికి కష్టములు ఎక్కువగా వచ్చునని పలికెదరు అది యెంతవరకు నిజము ? పరమేశ్వరుని ఆశ్రయించినందువల్ల కష్టములు తీరవలెను గాని కష్టములు వచ్చునా ?

ఉ: వత్సా, అసలు జన్మ యెందుకువచ్చినది. కర్మఉండుట చేతనే జన్మవచ్చినది. ఆకర్మ 2 విధములు : సుకర్మ-దుష్కర్మ. అనగా పుణ్యపాపము మిశ్రమము. వాటినిబట్టి ఆసమయములకు తగినట్లుగా వచ్చును జీవి జన్మకు వచ్చినప్పుడే సంచితార్థము మూట తీసుకు వచ్చును. వచ్చినది క్రమముగా అనుభవించును గాని మధ్య మధ్యను క్రొత్తగా ఏమీరాదు సుమా, అందుకే పుణ్యపాపములకు పూర్వజన్మ సంస్కారబలమని పెద్దలు పలుకుదురు.

ప్ర: తండ్రీ, సంచితార్థముమూట నెట్లుతీసుకువచ్చును ? తెలవిండు.

ఉ: వత్సా, యాత్రికులు ప్రయాణముకొరకు కావలసిన పదార్థాలను మూటకట్టి వెళ్ళవలసినగ్రామము చేరినతరువాత మూటవిప్పి పదార్థములను అనుభవించుదురు. అట్లే పుణ్య పాపములమూటతోనే జన్మకివచ్చి వాటిని అనుసరించి జీవయాత్ర నడుపును కనుక జ్ఞానికి అజ్ఞానికి సమానమే.

ప్ర: తండ్రీ, అయితే లోకులు ఎందుకు అట్లుచెప్పెదరు. భక్తునికి కష్టములు ఎక్కువఅని ఇంకా విపరీతవాక్యములు పలికెదరు; ఏమికారణము?

ఉ: వత్సా, సున్నమువేసిన తెల్లని గోడమీద ఎంతకొంచెము ధూళిగాని బురదగాని పడినయెడల వెంటనే చూపరులకు అయ్యోఅని ఒకవిధమైన దయకలుగును. పైకి కనపడును. ఆశ్చర్యముగా చూచుదురు. సున్నములేని నల్లగోడలమీద యెంతమలినము బురదపడినను యెవరుచూడరు ఏమీఅనరు ఆవిధముగా భక్తునికి జ్ఞానికి అజ్ఞానికియున్న విషయములను బాగుగా గుర్తించుము. ఇక్కడ గాంధీ మహాత్ముడే దృష్టాంతము ఎంతమంది జనము గుండుదెబ్బ తగిలి దేహమును విడువలేదు. విడుచుచున్నారుగదా, ఎవరైనను లక్ష్యముచేసిరా. పుణ్యపురుషుడగు మహాత్మునికి దెబ్బతగిలేసరికి సర్వజగత్తు తల్లక్రిందులా అయినదిగదా, ఇంత కన్న వేరుగా నీకేమిదృష్టాంతము కావలెను. కనుక కష్టసుఖములు అందరికీ సమానమే. జన్మతోవచ్చినవి. చెయ్యనిదే ఏదీరాదుగదా, చేసినది అనుభవించకతీరదు. భక్తుడు భగవంతుని నిందచేయడు. నేనుచేసుకున్నకర్మ నేనుఅనుభవించక

తప్పదు. ఇకముందుచేయకూడదు అని పశ్చాత్తాపపడి భగవం తునిమీద భారమువేసి కర్తృత్వముపిడిచి చేయును. అజ్ఞాని అట్లు కాక భగవంతుని నిందచేసి కర్మానుసారముగానే జనన మరణప్రవాహములో పడిపోవును. నల్లగోడలవలె అజ్ఞానిని యెవరుచూడరు. తెల్లగోడనువలె సుజ్ఞానిని అందరుచూచి విపరీతమైన సంభాషణలు చేయుదురు. దూషణభూషణములు కూడా చేయుదురు.

ప్ర: తండ్రీ, జ్ఞాని భక్తుడు భగవంతుని నమ్మియుండును గదా, నమ్మినందువలన ప్రయోజనమేమి? ఇద్దరికి సమాన ముగా కష్టములు వచ్చినప్పుడు తండ్రీ నాకు గొప్ప సందేహ ముగా నున్నది. నాసందేహము తీర్చుడు?

ఉ: వత్సా, ఎంతబ్రహ్మనిష్ఠుడైనను చేసినపనికి ఫలిత మును అనుభవించకతీరదు. అనుభవించుచున్నను పూర్వజన్మ తాలూకు కర్మఫలితము ఇప్పుడు అనుభవమునకు వచ్చినదని ఆరహస్యము ఇప్పుడు తెలిసికొని పరమేశ్వర లక్ష్యముతో చేసిన యెడల మల్లీముందునకు సంచితార్థము. మూటనురియుండదు. శ్రీహరిని త్రికరణశుద్ధిగానమ్మి తలచినయెడల సర్వపాపములు హరించును. సందేహము విడిచి నమ్మకముతో పరిశీలన చేయుము. జ్ఞానికి అజ్ఞానికి, కష్టసుఖములు సమానముగానే వచ్చును. జ్ఞాని భక్తుడు (ప్రహ్లాదునివలె) విచారించడు. లోకమును భగవంతుని నిందచేయడు. నేను చేసుకొన్న కర్మేగదాఅని మొద్దువలె యుండునుగాని దేనికివిచారించడు.

అజ్ఞాని విచారించును. లోకమును భగవంతుని నిందచేయును. నీవు బాగుగా పరిశీలనచేయుము.

ప్ర : గురుప్రభో, జ్ఞాని ఎందుకు విచారించడు. వానికి కష్టము తెలియదా ?

ఉ : వత్సా, వానికి కష్టము తెలియదు. అఖండపర బ్రహ్మమును పరంజ్యోతిని కరతలామలకమువలె హస్తమున ధరించి సర్వకాలములయందు ఆదివ్యజ్యోతిచేత (స్వప్రకాశము చేతనే) జీవయాత్ర నడుపును. కనుక విచారించడు. వానికి విచారములేదు.

ప్ర : తండ్రీ, అదియెట్లు, భక్తునికి పరంజ్యోతి సహాయము ఎట్లాకలుగును శలవిండు ?

ఉ : వత్సా, ఒకడు ఒకగ్రామము వెళ్లవలసి యున్నప్పుడు వాడితాలూకు పెద్దవారు నాయనా నీవు వెళ్లుమార్గములో పెద్దఘాటీలు అగాధములు గోతులు చాలాయున్నవి. చేతిలో దీపములేనియెడల ఆఘాటీలలో అగాధములలో పడిపోయెదవు. కనుక మంచిలైటు చేతతీసుకుపొమ్మని బోధించుకురు. అందుకు పెద్దలబోధకు సమ్మతించి చేతలైటుతీసుకుపోయి ఎక్కడ ఎక్కడ ఘాటీలు గోతులుయున్నవని బోధించిరో ఆగురుతు ప్రకారము దారిలో బాగుగా పరిశీలనచేసి జాగ్రత్తగా గమ్యస్థానమును పొందును. చేతిలో లైటుయున్నదని ఘాటీలు అగాధములు గోతులు యెక్కడికీ పోలేదుగదా, అవి అలాగే యుండగా సాధకుడు నేర్పుగా పెద్దలబోధప్రకారము వెళ్లినయెడల కొంతదూరము వెళ్లుసరికి ఘాటీలులేని నిర్మల

మార్గము తెలియబడును. సుఖముగా గమ్యస్థానమును పొందును. మరిఒకనికి అట్టిబోధలుగాని లైటుగాని యుండవు. వాడు అగాధములలో తప్పక పడిపోవును. అట్లే అజ్ఞానికి గురుబోధగాని పెద్దలబోధగాని దివ్యజ్యోతిసహాయముగానియుండవు. ఆకారణముచేత (ఈషణత్రయములను) అహంకార మమకారముల పెద్ద అగాధములలో పడిపోవును. దారిగానక బాధపడును. భక్తుడుజ్ఞాని అట్లుగాక గురుబోధచేతను పెద్దలబోధచేతను భగవత్కటాక్షముచేతను పరంజ్యోతిని సంపాదించి జీవయాత్ర నడుపును. (ఈషణత్రయములను పెద్దఘాటీలలో పడిపోకుండా గొప్పధైర్యముపూని దివ్యజ్యోతి సహాయముచేత (స్వప్రకాశముచేత) జీవయాత్ర చేయును. అట్లుచేయగా కొంతకాలమునకు (సావిత్రీదేవి, నచికేతుడు) వలె రాజమార్గము అనగా ఘాటీలు అగాధములులేని మార్గముద్వారా గమ్యస్థానమును పొందును. కనుక ఘాటీలత్రోవ అందరికీ సమానమే. అజ్ఞాని మునిగిపోవును. భక్తుడు జ్ఞాని భగవజ్యోతిచేత భగవంతుని సహాయముచేత బయటపడుదురు. (ప్రహ్లాదుడు) వలె తెలియుము. కనుక భగవన్మహిమ భగవత్సహాయములేదని యెన్నడు అనకూడదు. జీవులభారము భగవంతునిదే అయియున్నదిగదా, అయితే ఆరహస్యము భక్తులు కానివారు తెలియలేరు. సృష్టిఅంతా యెప్పటికైనా చెడిపోవునుగదా, చెడనిపదార్థము ఏదియో ఆ గేస్థిరమనినమ్మి విచారములేకయుంటివేని ఈరోజుచేసినపని రేపు మరిచేయనవసరములేదుసుమా.

ప్ర: గురువరా, జీవత్వము యెట్లుపోవును? నిర్మలత్వము యెట్లు తెలియగలను?

ఉ: వత్సా, కాలికి ముల్లుగ్రుచ్చుకొని బాధపడుచున్నప్పుడు ఆముల్లుతీసి పారవేసిన బాధతగ్గును. బాధ తగ్గిన తరువాత నిర్మలముగా యుండును. బాధగా యున్నదని ఏ తెలివిచేత గ్రహించితివో ఆ తెలివిచేతనే నిర్మలతత్త్వమును తెలియుము. ముల్లుపోయినట్లు జీవత్త్వము పోవలెను. ముల్లుపోయిన తరువాత నిర్మలముగా యున్నదని తెలియునట్లు జీవన్ముక్తుడవు అయిన తరువాత నిర్మలతత్త్వము తెలియబడును.

ప్ర: పరానంద, ముల్లుతీసినట్లు జీవత్వము దేనితో తీయవలెను? ముల్లు బాధించునట్లు జీవత్వము యెట్లుబాధించును?

ఉ: వత్సా, జీవత్వము యెట్లుబాధించుననగా, నేను జీవిని నేను సంసారిని నేను స్త్రీని నేను బద్ధురాలను నేను పురుషుడను సర్వస్వతంత్రుడను అని అనేక విపరీతభావనలతో అహం అహం అని హృదయములో జీవత్వము కాలిలో ముల్లువలె సదా బాధించుచునే యుండును. దేనితో ముల్లుతీయుననగా కాలిలో ముల్లును పైముల్లు అనగా సూదితో తీసివేసి ముల్లు సూదికూడా విడిచినట్లు విడువవలెను. ముల్లును ముల్లుచేతనే తీయవలెనుగదా, అట్లే జీవత్త్వమనే అహం వృత్తితోగూడిన ముల్లును పరతత్త్వమనేశుద్ధ తెలివి అనే పైముల్లుచేత తీసివేయవలెను.

ప్ర: తండ్రీ, అదియెట్లు? సందేహముగా యున్నది విశదముగా చెప్పవలెను?

ఉ: వత్సా, భగవన్నామము అనే పైముల్లు చేత తీయుము. అ క్రమముగా శుద్ధ తెలివిగా విశదమగును. సందేహించకుము.

ప్ర: తండ్రీ, 2 ముల్లులుకూడా విడువమని శలవిచ్చితిరి మీా అభిప్రాయము ఏమి ?

ఉ: వత్సా, సర్వతత్త్వములను 24 తత్త్వములను తొలగించి సర్వములోను నేను నీవు అన్న అభిమానమును తొలగించుము. ఆఖరున (అయమాత్మాబ్రహ్మ) అనువృత్తి కూడా తొలగించి ఏ భావనచేత నిర్మలముగా యుండుటే, 2 ముల్లులుకూడా తీయుట అని తెలియుము. (అయమాత్మేత్యభావకః) అనునట్లు వ్యాచ్యార్థమును విడిచిన, లక్ష్యార్థమే శేషించును. అదే నిర్మలము.

ప్ర: తండ్రీ, కాలిలో ముల్లువలె అహంభావన అంత బాధగా యుండునా గురువరా ? జీవత్త్వము అంటే ఏమిటో అనుకుంటిని తండ్రీ, ఇప్పటికైనను మేలుకొలిపితిరిగదా ?

ఉ: కుమారా, అవును అంతబాధగానే యుండును. జీవత్త్వమనగా ఏమి అనుకొంటివి నిజతత్త్వమునుపొంది మహాశీయులు యెంత ధన్యత్వమునొంది యెంతశాన్తినిపొంది యెంత బ్రహ్మానంద నిమగ్నులైరో నీకు ఏమైన తెలుసునా. ఆ ఆనందమే ఆనందము. వారి శాన్తియే శాన్తి. వర్ణించశక్యము కాదుసుమా. ఇప్పుడైనను మెళుకువ, తెలివి వచ్చినదా.

ప్ర: తండ్రీ! వచ్చినది. మీాపవిత్ర హస్తముతో వెన్నుతట్టి లే నాయనా అని మేలుకొలిపి నప్పుడు ఏమిలోపముండును ? ఈ తెలివి అయిననూ స్థిరముగా నుండునా ?

ఉ: వత్సా, గొప్పధీరత్వముతో లేచినిలబడిన యెడల స్థిరముగా నుండును. భయములేదు. భయపడి జారిపోకుము. ధైర్యముగా నిలబడుము.

ప్ర: గురువర్యా, మీరు ఇంతశ్రమపడుట యెందులకు? ఇంతకష్టపడి యెందుకు బోధచేయుచున్నారు? విశేషముగా శాన్తిశాన్తి అనియు ఈగ్రంధము అంతయు శాన్తివాక్యములే తెలియచేయు చున్నారే ఏమికారణము?

ఉ: వత్సా, కుమారా, సర్వజీవులు ఆనందముగా శాన్తిగా యుండుటే నాముఖ్యాభిప్రాయము. సర్వజీవులు శాన్తిలేక బాధపడుచున్నారుగదా, కనుక జీవుల తాపమునకు శాన్తి కలుగుతే నాకు ఏమిశ్రమ లేదు. జీవులతాపనివృత్తి కొరకే బోధించవలసివచ్చినది. అందుచేత శ్రమ యెంతమాత్రము లేదుసుమా! జీవుల తాపశాన్తి కొరకేగదా. జగత్తు అంతలోను అనేకమహానీయులు అనాదినుంచీ శాన్తిగ్రంధములు అనేకసాధనలు అనేకఆశ్రమములు స్థాపించుటకు కారణమైనది. అట్టి మహాపురుషులకు శ్రమ ఏమైనా యున్నదా, లేదే!

ప్ర: తండ్రీ, జీవులకు దేనిచేత తాపము కలుగును? దయ చూపుము?

ఉ: వత్సా, అధ్యాత్మికము ఆధిదైవికము ఆదిభౌతికముల చేత తాపము కలుగును.

ప్ర: తండ్రీ, దేనిచేత ఆతాపము శాన్తించును శలవిండు?

ఉ: వత్సా, అందుకేగదా నీకు ఇంతగా బోధింపవలసి వచ్చినది. త్రిపుటవర్గముదాటి అమృతానందములో మునిగిన

శాన్తించును. గంగా యమునా సరస్వతీ అను త్రిశక్తులతో కూడినదే త్రివేణీసంగమము. ఆ త్రివేణీ సంగమములోనుంచి బయట పడితే తాపత్రయము శాన్తించును.

ప్ర: గురుమూర్తి, శాన్తి అనగా నేమి? దానికి గురుతు ఏమిటి?

ప్ర: హృదయము శాన్తిగా నుండవలెను. దానికి గుర్తు ఏమనగా, (శాన్తినిలయా) అని సర్వేశ్వరునకు ఒక నామ మున్నదిగదా ఎక్కడ శాన్తి యుంటే అక్కడ సర్వేశ్వరుడు పూర్ణశాన్తితో యుండును. అప్పుడు హృదయము శాన్తిగా నిండుగా తృప్తిగా నుండును. అదే నీకు గురుతు. బాగుగా పరిశీలనచేయుము.

ప్ర: తండ్రీ, హృదయము శాన్తిగా నిండుగా పూర్ణముగా లేనందున నిబంధవిముక్తి లేదని శలవిచ్చెదరా?

ఉ: వత్సా, కుమారా, సందేహామేల! విముక్తిలేదు. ఆశాన్తికొరకే ఇంతగా బోధించవలసి వచ్చినది. వేదస్మృతులు ఘోషించుచున్నవి. సంసారదావాగ్ని అమృతవృష్టిచే గాని శాన్తించదుసుమా.

ప్ర: తండ్రీ, ఆశాన్తి యెట్లుండును? దయచూప వేడుచున్నాను?

ఉ: వత్సా, సర్వకాల సర్వావస్థలయందు ఎట్టివిషయములు వచ్చినా హృదయమున సుఖదుఃఖములకు ఖాళీఇవ్వకూడదు. హృదయము నిండుగా చలనములేక యుండవలెను. నివురు కప్పిన నిప్పుకూడాలేక శాన్తిగా యుండవలెను. ఇప్పుడు

పూర్ణచంద్రునివలె హృదయము నిర్మలముగా శాన్తిగా యుండును. అతిశీతలముగానుండును.

ప్ర: గురువరా, మీ ఆశీర్వచనబలముచేతను మీ అమృతోప మానములైన శాన్తివచనములచేతను, హృదయ తాపముతీరి శాన్తిగాయున్నది. అయినను శాన్తివాక్యములను గురించి పెద్దలైన మహాపురుషుల మహిమలు సద్గురు వచనములు ఇంకను శలవిండు?

ఉ: వత్సా, పెద్దలైన మహాపురుషులు సద్గురువులు ఎల్లప్పుడు వత్సలను శాన్తివాక్యములచేతనే తృప్తిపరచెదరు. వారి మహిమలు చెప్పతరము కాదు. ఆ శాన్తివాక్యముల మహిమ కొంత కాలమునకు వత్సలు తెలియుదురు. పెద్దలయొక్క ఆశీర్వచనబలము శాన్తిరసముతో కూడిన బోధ వృధాపోవునని యెన్నడు అనకుము. వారు వెంటనేయుండి రక్షించి కాపాడెదరు. అదే వారిమహిమ అని తెలియుము. ప్రహ్లాదుని శ్రీమహావిష్ణుమూర్తి యెట్లు కాపాడెను. ఆమాదిరిగా తెలియుము. పెద్దల కరుణాకటాక్షము అనుభవైకవేద్యమే కాని వర్ణించ శక్యముకాదు.

ప్ర: తండ్రీ, వారిలో అంతమహత్తు యున్నదా? ఏమి విచిత్రము? శంకా శలవిండు?

ఉ: వత్సా, సందేహమేల. అగాధములో పడిపోయిన వారిని పైకిలేవతీసి చేరతీసి శాన్తిపరచి అమృతవర్షము శాన్తి వర్షముఇచ్చి రక్షించి కాపాడుదురు.

ప్ర : తండ్రీ, అప్పుడు వత్సలు సాధకులు నెట్లుందురు ? దయచూపుడు ?

ఉ : వత్సా, పెద్దవర్షము పడుచున్నప్పుడు వర్షములో సాధకుడు నిలచిన యెడల అతనికి నలువైపుల వర్షము పడుచున్నప్పుడు ఎంతశీతలముగా యుండునో యెట్లుండునో తదాకారమై ఆమాదిరిగా యుండును. వత్సలకు ఎటుచూచినా అమృత వర్షముగానే యుండును. వారిని (సద్గురువులు పెద్దలు) ఎప్పుడు సదారక్షించుదురు. వారిదయ అపారకరుణాసముద్రము. చెప్పతరముకాదు. అనుభవించవలసినదే.

ప్ర : అయితే చివరకు బ్రహ్మవిదుడు జ్ఞాని అయినందున ప్రయోజనమేమి ? ఏమిచేయును ?

ఉ : వత్సా, బ్రహ్మజ్ఞాని అయినందున తిరిగి జన్మలేక త్రిపుటిరహితముగుటే ప్రయోజనము. (నిస్త్రైగుణ్యోభవార్జున) అనునట్లు త్రిగుణములతో గూడిన ఆశాసముద్రమును దాటి ధన్యత్వమును పొందును. ఏమిచేయుననగా శరీరమున్నంత వరకు శరీరము వీడువరకు ఫలితాఫలితములులేక నిష్ప్రయోజనముగా ప్రారబ్ధము ననుసరించి జీవయాత్రచేయును. జీవయాత్ర నడచుచున్నను సుఖదుఃఖములకు సంబంధించిన విలక్షణముగా తెలివిగా సంచారము చేయునుగాని ఏవిధమైన విచారము పొందడు.

ప్ర : గురుస్వామీ, ప్రారబ్ధము తాలూకు క్షోభ పెద్ద గాంభీర్యముగా సముద్రము కెరటములవలె వచ్చునుగదా. ఆక్షోభకి సాధకుడు ఆగగలడా ?

ఉ: వత్సా, బ్రహ్మవిదుడు అయిన యెడల ఆక్షోభ లక్ష్యము చేయడు. కాని వారు బాధపడుదురు. అనగా పూర్ణజ్ఞాని అయిన యెడల దేనికి బాధపడడు.

ప్ర: తండ్రీ, పరానంద, మీరు యెన్నివిధములుగా బోధించినను నాకు బోధపడుటడుట లేదు? బ్రహ్మవిదునకు ఎందుకు ఏదీఅంటదు? సర్వజగత్తు ఇంతసౌందర్యముగా ప్రకాశించుచున్నది గదా, ఆసౌందర్యముచూచి యెందుకు నమ్మడు?

ఉ: వత్సా, సర్వజగత్తు యెంతిసౌందర్యముగా యున్నను సంధ్యాకాలములో సూర్యరశ్మివలెను మేఘములవలె మెరుములువలెను దగ్ధపటలమువలెను చూచునుగాని ఆజగత్సృష్టిని నమ్మడు అపేక్షించడు. దానివల్ల ప్రయోజనములేదు.

ప్ర: తండ్రీ, నిత్యానంద, అభ్యాసములలో ఏది శ్రేష్టము? యెన్నివిధములు?

ఉ: కుమారా, అభ్యాసములు అనంతములు చెప్పశక్యము కాదు. అయినను ముఖ్యముగా మూడుమాత్రమే తెలిపెదను వినుము. (1) సగుణాభ్యాసము హృదయకమలములో చరాచరమాలలోయున్న విశ్వమూర్తిని (గుహాశయాం విశ్వమూర్తిషు) అనునట్లు నీబుద్ధిగుహలోయున్న విశ్వమూర్తిని నీయిష్టాను సారము అభ్యాసముచేసి ధ్యానము చేయుము. ఇదే మొదటి భక్తిమార్గము అనబడును.

ప్ర: తండ్రీ, విశ్వమూర్తి అనగానేమి? విశ్వములో ఏ మూర్తిగా నుండెను? తెలవిండు?

ఉ: వత్సా, గీతలలో శ్రీకృష్ణపరమాత్మ విశ్వరూపమును

విభూతియోగము చూపలేదా, చెప్పలేదా, చరాచరములలో నున్న స్వరూపము చెప్పబడెనుగదా అదేసుమా, విశ్వాకారుడే విశ్వమూర్తి బాగుగా గుర్తించుము. (2) తరువాత నిర్గుణధ్యానము అభ్యాసము యెట్లనగా ఇదివరలో నామరూప ధ్యానము చేసిచేసి చూచిచూచి విసిగియుంటివిగదా, కనుక నామరూపములను తొలగించి నిరామయమును నిర్మలమును అభ్యాసముచేసి ధ్యానము చేయుము. అది అభ్యాసముకొలది దృఢతరాభ్యాసముచేసిన స్థిరధ్యానములో స్థిరత్వము కలుగును.

ప్ర: తండ్రీ, ముఖ్యముగా మూడు అంటిరి ఇంకా విశేషములు యున్నవని తలుస్తాను శెలవిండు ?

ఉ: వత్సా, అనంతములు యున్నవి. కాని నీకు ఆ గంభీర గోళములన్నీ యెందుకు. నీఅంతఃకరణ బలమునకు ఇవిచాలును. ఇవిమాత్రము సామాన్య మనుకుంటివా యేమి సారముఅంతయు ఇందులోనే యున్నది. ఇవియే 10 వేలు అనుకో. ఇందులో అనేకగూఢార్థము లున్నవి. నెమ్మదిగా పరిశోధనచేయుము. పైవి మూడుగానే యున్నవిగాని తెలుసుకుంటే అర్థములు అనంతము లున్నవి.

ప్ర: తండ్రీ, మీబోధ అయినతరువాత పరిశీలన చేస్తాను. శ్రవణముఅంతా పూర్తిగావింపుడు తరువాత ఆలోచించెదను ?

ఉ: నాయనా, (3) వివేకముగా అభ్యాసము చేయుము. దీనిలో చాలకష్టముగా యుండునుసుమా ! జారిపోకుండా దృఢముగా అభ్యాసము చేయుము. అనగా తానెవరో పరుడు ఎవరో నిరామయమనగా ఏమో, నిర్మలధ్యాన మనగానేమి

అని వివేకజ్ఞానములో అభ్యాసముచేయగా ఆ పరమ రహస్యము నీకు విశదమగును. (సరి జన్మ సరి) మరి ఆపైని ప్రశ్న లేదు సుమా !

ప్ర : గురువరా, సరి అని మీరు అంతచక్కగా నేర్పుగా సులువుగా తెలవిచ్చితిరిగాని కష్టముగదా ?

ఉ : వత్సా, అవును కష్టమే. కాదని అనలేదు. అందుకే అభ్యాసము చేయగా క్రమముగా బ్రహ్మనిష్ఠతత్వములోనికి వచ్చునటికి సులువుగానేయుండును. బ్రహ్మనిష్ఠునకు సులువే సుమా, సరియే దీనినిగురించియేగదా సప్తకోటిమహామంత్ర ములు అనేకగురువులు మతములు శాస్త్రములు ఘోషపెట్టు చున్నవి. అయినను ఆ నిజతత్త్వము అందరికిని లభ్యము కాదుకదా. నీవంటి పుణ్యాత్మునకే లభ్యము అగును. అందు కనే నీకు ముఖ్యసంగతులు మూడు మాత్రమే చెప్పబడెను. పూర్వపుణ్యము లేనివారు బాధపడుదురు. అనేక అభ్యా సములను అగాధములోబడి యెప్పటికో యెన్నిజన్మలలోనో బయటపడుదురు.

ప్ర : తండ్రీ, సర్వలాత్మ, నామముచేయమని తెలవిచ్చితిరి గదా మీ అభిప్రాయమేమి ? నామమనగానేమి ? తెలపిండు ?

ఉ : నాయనా, వెర్రివాడా, వినుము. (కలియుగే స్మరణాన్ ముక్తిః) అనునట్లు స్మరణమాత్రముచేతనే ముక్తి కలుగునని పెద్దల అభిప్రాయము. స్మరణ అనగా నామస్మరణ అనగా నిజనామస్మరణ నేను అనగా తాను అనగా నెవరో తెలిసి ఆ తెలిసిన పదార్థమును మరచిపోకుండా స్మరించవలెను.

ప్ర : తండ్రీ, అదియెట్లు ? నిజనామమనగానేమి ? విశదపరచ వలెను.

ఉ : వత్సా, జీవికి వర్ణాశ్రమధర్మములు కులగోత్రనామములు నెట్లుసహజమో. అనగా మొదటి ఫలానావ్యక్తి ఆ వ్యక్తికి ఫలాన కులగోత్రనామములు ఒకపర్యాయము నిర్ణయించి చెప్పినప్పుడు ఆజ్ఞాపకముతో ఆ తెలివితో లోక వ్యవహారము చేయుచున్నను ఆ కులగోత్రనామములు మరువలేదు గదా తిరిగి మళ్లీ ఒకరు ప్రబోధము చేయునవసరములేదుగదా.

ప్ర : తండ్రీ, ఆమాదిరి ఇక్కడ ఏమని నామధేయము చేసిరి ? ఆనామము ఏకారణముచేత మరచిపోవును ? ఏమని ప్రబోధము చేయును ?

ఉ : వత్సా, నిర్వికారుడవు నిరంజనుడవు నిరామయుడవు నిరుపాధికుడవు అని కొన్నిదృష్టాంతములు చూపును. ఆప్రకారము తాను ఆలక్ష్యములో యుండి తానెవరో మరవకూడదు. మరవకుండా సదా తెలివిగాయుండుటే బంధవిముక్తి అనబడును. కనుక తానెవరో అన్న స్మరణ మరువక యుండుటే నిజనామ స్మరణ అని తెలుయుము. అజ్ఞానాంధకారము శరీరత్రయము కప్పుటచేత, ఆనామము మరిచిపోవును. ఏమనిప్రబోధము చేయుననగా ఉపదేశపూర్వకముగా మరిచిపోయిన పదార్థమును తెలివి తెప్పించి మేలుకొలుపును. అప్పుడు శాన్తి కలుగును.

ప్ర : తండ్రీ, తెలిసినది ఎంతచిత్ర విచిత్రముగా బోధించుచున్నారు. మీరు యెప్పుడేని విసుగుచెంది పోరా అని నిరాకరించుతారేమో చూచెదమని అనేకవిధములుగా విప

రీత ప్రశ్నలను అడుగుచుంటిని. ఎన్నివిధములుగా అడిగినను విసుగు కోపములేక అడిగినవిషయములన్నిటినీ జవాబు ఇచ్చెదరు. కోపము యెందుకురాలేదు తెలవింపు ?

ఉ: వత్సా, పెంకిపిల్లలు అల్లరిచేయునప్పుడు వారిస్వభావమిట్టిది అని తెలిసికొనుచుందురుగాని కోపమురాదు. అడిగిన దానికి జవాబు చెప్పిన వెళ్లిపోతారుగాని ఏమీచేయలేరని స్థైర్యముగాను, అంతేకాక పరిహాసములను ఏమీచేయుచునా మీరు అడిగడము పెద్దలు బోధచేయుట స్వధర్మమేగదా, కనుక ఏమి అడిగినా విసుగులేక జవాబు చెప్పవలసినదే. సందేహములేదు.

ప్ర: తండ్రీ, అయితే, 24 తత్త్వముల తాలూకు తమస్సు గాఢముగా యున్నప్పుడు, స్వరూపజ్ఞానము యెట్లు తెలియును. మోహముతో గూడిన సంసారహాలాహలము యెట్లు శాంతించును.

ఉ: వత్సా, అవును. నీవు చెప్పినప్రకారము 24 తత్త్వముల తాలూకు తమస్సు గాఢముగానే యుండును. నిజమే (అమృతం జ్ఞానమే తేన జ్ఞానినో నిత్యవైరిణా) అనునట్లు కోరికలనే కామముతో కూడినవృత్తి జ్ఞానికి నిత్యశత్రువుసుమా. అప్పుడే సంసారదావాగ్ని హాలాహలము జ్ఞాతనుదహించుచుండునుగదా ఎట్లనగా పంచాగ్ని మధ్యస్థునిరీతి తెలియును. అది ఆ హాలాహలము యెట్లుశాంతించుననగా మేఘములలో మెరుపు అతిస్వల్పమైనములో జిగ్గున మెరసి తృటికాలములో లయమగును. ఆమెరుపు జ్ఞాతకు గొప్ప ఆనందకరముగా యుండునుగదా, ఆమాదిరిగానే 24 తత్వముల తాలూకు

తమస్సులో, తాపములో మునిగినప్పటికీ జీవికి లిప్తమాత్ర మైనను త్రుటికాలమైనను అనగా అతి స్వల్పములోనైనను స్వరూపజ్ఞానము కలిగిన యెడల చాలును. ఆజ్ఞానమే క్రమముగా అక్షయమై 24 ఘంటలు ఏకగ్రీవముగా తృప్తిగా శాన్తిగా ఆనందముగా నుండును. అప్పుడు సంసారదావాగ్ని సంసార హాలాహలమును మోహము తమస్సు శాన్తించును.

ప్ర: తండ్రీ, మేఘములలో మెరుపువలె అంతస్వల్పకాల మైనను స్వరూపజ్ఞానము కలుగుతే అదేక్రమముగా వృద్ధియగు ననియా మీఅభిప్రాయము ?

ఉ: వత్సా, అవును సందేహమేల లిప్తమైనను నిర్మలస్థితి తెలిసితివేని అదేయభివృద్ధి యగును. సందేహించకుము.

ప్ర: తండ్రీ, సర్వసంగ పరిత్యాగమనగానేమి ? దయచూప వలెను ?

ఉ: వత్సా, కుమార, సర్వసంగ పరిత్యాగమనగా దండ కమండలములుకూడా విడిచి దిగంబరుడై అడవులుబట్టి తిరుగు టయే కాదుసుమా ! అట్లైతేనేగాని మోక్షములేదని భ్రమ పడకుసుమా ! ఎక్కడనున్నను దేశకాల నియమములతో నీకు పనిలేదు. దేశకాల నియమములలో యున్నప్పటికీ ఆ దేశ కాలనియమముల తాలూకు సంగము నీహృదయమునకు అంట కుండా వివేకముచేత విలక్షణమని తెలిసి .సంగములేక (సర్వ కర్మ ఫలత్యాగం) అనునట్లు (నిస్త్రైగుణ్యోభవార్జున) అనునట్లు తెలిసి గుణకర్మల సంగదోషము అంటకుండా తెలివిగా వర్తిం చడమే సర్వసంగపరిత్యాగమనబడును. జ్ఞానవాసిష్టములో

శిఖధ్వజుడు చూడాలను గురించిన కథను బాగుగా పరిశోధించుము. త్యాగమనగా ఏమిటని అనుకుంటివి. మహాకర్త కర్తకాక సుహాభోక్త భోక్తకాక మహాత్యాగి త్యాగికాక అనగా చూడాలవలె అని తెలియుము. త్యాగి అనగా అట్టి హృదయవాసనలు పూర్తిగా విడునవలెనుగాని అడవులలో ఆకు భక్షించుటకాదు. కనుక త్యాగమనగాఏమో బాగుగా తెలియుము. శిఖధ్వజునివలె వృథాశ్రమపడకుము.

ప్ర: తండ్రీ, మోక్షము పొందుటకు ఏది దగ్గరమార్గము? విశదపరచవలెను?

ఉ: వత్సా, భక్తిమార్గము దగ్గరమార్గము. అందులో అనన్యభక్తి మరీ దగ్గరమార్గము. (నిర్వైరస్సర్వభూతేషు యస్సమామేతిపాణ్డవ) అనునట్లు సర్వభూతములయందు విరోధములేనివారు సర్వేశ్వరుని తప్పక పొందుదురు.

ప్ర: తండ్రీ, ఎందుచేత భక్తిమార్గముదగ్గర యోగమార్గముకాదా?

ఉ: వత్సా, యోగమార్గము కొంచెము కష్టతరము. దానికి కొన్ని దేశకాల నియమములు కొన్ని కట్టుబాట్లు యున్నవి. శరీరబలము లేనివారికి కొన్ని విపరీత లక్షణములు కూడా కలుగును. భక్తిమార్గములో అట్లుకాక శరీరబలము దేశకాలనియమములు యెట్లున్నను భక్తిపరవశము యెక్కువగా నుండును. దానిచేత తొందరగా దగ్గరమార్గముగా వెళ్లవచ్చును. జ్ఞానమునకు భక్తిమార్గము చాలసమీపమని తెలియుము.

ప్ర : తండ్రీ, ఎందుచేతను ? భక్తిలో విశేషమేమి ? తెలియ చేయుము ?

ఉ : నాయనా, నీవు నిర్మలభక్తితో ధ్యానము చేయునప్పుడు నీహృదయములోనున్న కఠినపదార్థము (హృదయ గ్రంధి) ద్రవరూపమై నవనీతమువలె కరిగి భక్తిపరవశమై ఊహాతీతమై సర్వేశ్వరునిలో కలియును. సందేహము లేదు. ఇంకా చెప్పశక్యముగాని విశేషములు భక్తిరసములోనున్నవి. ఆరహస్యము అనుభవజ్ఞులకే తెలియునుగాని ఇతరులకు తెలియ తరముకాదు.

ప్ర : తండ్రీ, హృదయములో కఠినపదార్థయము యెట్లుండును?

ఉ : నాయనా, అజ్ఞానావరణ జన్మజన్మార్జిత దోషములు. బ్రహ్మసృష్టి ప్రారంభమునుంచీ ఘనీభూతమై గడ్డకట్టి కాటుక కొండలవలె పెరిగి కఠినముగా హృదయము పాషాణమువలె యుండును. ఆ కఠినమంతయు భక్తిరసముచేత క్రమముగా కరిగి హృదయము తేలికగా యుండును. నిర్మలముగా యుండును. అప్పుడు నేను అన్న ఆభాసకర్తృత్వము క్రమముగా నిర్మలము అగును. (భక్త్యాత్వనన్యయాశక్యః) అనునట్లు అనన్యభక్తియే కారణము.

ప్ర : గురువరా, వేకువజామున భగవధ్యానము నామము చేయుటలో విశేషమేమి ? పెద్దలు అట్లు నియమించుటలో అభిప్రాయమేమి ?

ఉ : వత్సా, వేకువజామున భగవద్ధ్యానము చేయుటలో అనేకవిశేషము లున్నవి. (1) (నిశ్శబ్దేబ్రహ్మఉచ్యతే) అను

నట్లు సృష్టి తాలూకు విచిత్రములు శబ్దములు గందరగోళములు ఏమీలేక నిశ్శబ్దముగా యుండును. ఆ నిశ్శబ్దములో భగవ ద్ధ్యానము చేసినయెడల తొందరగా భగవత్సాక్షాత్కారము అగును. భగవంతుని నిష్కామముగా నిరామయముగా నిరుపాధిగా తెలియవలెను. (నిర్జనుని) నిర్జనముగానే తెలియ వలెను. కనుక ఇది ముఖ్యవిషయము. దీనిలో లక్ష్యము బాగుగాయుండవలెను. (2) శరీరము తాలూకు సర్వమలి నములు మలములు అన్నీతగ్గి కొంతనిద్రావస్థతీరి శరీరము తేలికగా యుండును. దేనికైకను శరీరారోగ్య ముండవలెను గదా, అందుచేత ఆ సమయములో శరీరము స్వాధీనముగా యుం డును. (3) క్షుత్పిపాసలను గురించిన వ్యాపారముఏమీ అప్పుడులేక, నిర్వ్యాపారముగా నుండును. ఇంకా అనేక కారణములున్నవి. (4) పగటివేళ 2 జాము లయేసరికి క్షుద్బాధ యెంతతీవ్రముగా నుండునో, ఆమాదిరిగా రాత్రి 2 జాముల కాలము దాటినతరువాత భగవద్ధ్యానముచేయుటకు అంతఆతురతగా తీవ్రముగా యెక్కువగా యుండును. అనగా భగవత్ప్రసాదమును (ప్రసన్నముకొరకు) ఆతురతగా నుండును. అందుకొరకే పెద్దలు, శాస్త్రములు, ఆ సమయమును నియమించిరి.

ప్ర: తండ్రీ, అనగా అదియెట్లు? విశదముగా తెలపిండు? సంశయములు తీర్చవేడుచున్నాను?

ఉ: వత్సా, (5) రాత్రి రెండుజాములుగడచి, 3 వ జాము ప్రారంభము అయేసరికి మరుచటిదినములోనే చేరునుగదా. క్రమముగా సూర్యోదయమునకు పూర్వము అరుణోదయము

కనుక నీకు ఏది శ్రేయస్కరమో బాగుగా పరిశీలనచేసి నీకు తోచినట్లు చేయుము. సందేహములు విడువుము. ధైర్యముగా నిలబడుము.

ప్ర: గురుమూర్తి, సద్గురుమూర్తి, నమస్కారము. మీ ఆజ్ఞ అను మహాప్రసాదమును శిరసావహించినాను. స్వారాజ్యమునుపొంది గర్భనరకము జననమరణ ప్రవాహమును మరచిపోవుదును. నమస్కారము ?

ఉ: వత్సా, ప్రియపుత్రా, నీవు చాలశ్రమపడితివిగదా, సుఖించుము. సుఖీభవ పూర్ణసుఖమునుపొంది సుఖించుదువుగాక ! చిరంజీవివి దీర్ఘాయుష్మంతుడవు సార్వభౌముడవు అగుదువుగాక ! వత్సా ఆ మంగళకరుని లక్ష్యములో యుంచిన నీకు నిత్యమంగళము జయమంగళము అగును.

ఓం సర్వేషాం స్వస్తిభవతు ఓం సర్వేషాం శాన్తిభవతు
ఓం సర్వేషాం సుఖభవతు ఓం సర్వేషాం పూర్ణంభవతు
ఓం శాంతి, శ్శాంతి, శ్శాంతిః
శ్రీసద్గురుచరణార్పణమస్తు.



సరస్వతీ పవర్ ప్రెస్, రాజమంద్రి

# ఆంధ్ర రచయితలు

రచయిత : మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారు

19 వ శతాబ్దములో జన్మించిన నూరుగురు ప్రసిద్ధాంధ్ర రచయితల జీవిత — రచనా సమీక్షలుగల మనోహరగ్రంథము.

ఆంధ్ర వాఙ్మయమున నేడు, శ్రీ వీరేశలింగంపంతులు గారి కవులచరిత్రతో సరితూగగల గ్రంథ మిది ఒక్కటే.

చారిత్రకులకే కాక, రసిక విమర్శకులకును సతినివాసమైన యాకూర్పులో 1806 లో జన్మించిన చిన్నయసూరి మొదలు 1901 లో జన్మించిన పుచ్చల సీతారామమూర్తి చౌదరిగారి వరకుగల అభినవాంధ్ర రచయితలు నూరుగురను గూర్చిన చరిత్రోపయోగకరమగు విషయ సంగ్రహ మిందు చేర్పబడినవి.

వారి వారి రచనలపై మృదుమధురమైన వచనశైలిలో వ్రాయబడిన సమీక్షలు చదువుట కెంతో ముచ్చటగొల్పును. 566 పేజీలు, గ్లేజుకాగితం, క్యాలికో బైండు. వెల రు 6-0-0

పోస్టేజీ రు 0-12-0

[ముందుగా, మనియార్డరులో రు 6-12-0 పంపువారికి రిజిస్టరు పోస్టులో పుస్తకం పంపెదము. వి. పి. పద్ధతి లేదు.]

---

సరస్వతీ పవర్ ప్రెస్, రాజమండ్రి అని వ్రాయవలెను.

# కథా సరిత్సాగరము

తల్లావజ్ఝల శివశంకరశాస్త్రి, కృత్తివాసతీర్థులు
సంస్కృతమునుండి తెలిగించినది.

ఆరు సంపుటాలు. ప్రతి సంపుటమున్నూ సుమారుగు 200 పేజీలు కలిగి ఉంటుంది.

| | | | |
|---|---|---|---|
| మొదటి సంపుటం | | 1 — 23 | తరంగములు |
| రెండవ | ,, | 24 — 43 | ,, |
| మూడవ | ,, | 44 — 55 | ,, |
| నాల్గవ | ,, | 56 — 73 | ,, |
| అయిదవ | ,, | 74 — 104 | ,, |
| ఆరవ | ,, | 105 — 124 | ,, |

నీతిదాయకములైన సుమారు 600 కథలతో, మనోహరమైన భాషతో ముచ్చటగొలిపే పుస్తకం యిది.

ఇందులో దివ్యుల చరిత్రలూ, మానవుల చరిత్రలూ, సిద్ధ[illegible] జాతుల కథలూ, [illegible] వృత్తాంతాలూ, వణిక్పుత్రుల వ్యాపారవిశేషాలూ, ద్వీపాంతరవాసుల స్థితిగతులూ, [illegible] విచిత్రమైన చరిత్రలూ వర్ణింపబడ్డాయి.

కథా సంపుటంగానూ, న్యాస రూపంగానూ ఉండి ఈ గ్రంథం విజ్ఞానం ఆర్జించుకోడానికి మంచి అవకాశం కలిగిఉంది.

విడివిడిగా ప్రతి సంపుటమున్నూ రు 2-8-0

---

సరస్వతీ పవర్ ప్రెస్, రాజమండ్రి అని వ్రాయవలెను.